15.10.1993 శుక్రవారం, 10 పేజీలు, సంపుటి: 64, సంచిక: 42, విడిప్రతి: రు. 2.00 లు

Regd. No. HNL. 18

# జమీన్‌రైతు

జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి, స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు



## రియల్ హీరో భజన

రాష్ట్ర ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కరరెడ్డి ఏడాది పాలన పూర్తయిన సందర్భంగా ఏర్పాటు చేసిన వివిధ కార్యక్రమాల్లో ఎమ్మెల్యేలు, మంత్రులు ఆయనను ఆకాశానికి ఎత్తేస్తున్నారు. నిన్నగాక మొన్నటిదాకా కోట్ల వారితో కాస్తంత ఎడంగా వుండే 'మన జిల్లా మంత్రి' పసల పెంచలయ్య కూడా కోట్లవారిని 'రియల్‌హీరో' గా అభివర్ణించారు. మంత్రి వర్గ విస్తరణలో చావు తప్పి కన్నులొట్టపోయిన తర్వాత పెంచలయ్యకు ముఖ్యమంత్రి రియల్ హీరోగా కన్పించడంలో తప్పులేదు కానీ మిగతా మంత్రులు ' పనిగట్టుకొని కోట్ల వారి గుణ గణాలను ప్రస్తుతించడం మాత్రం రాష్ట్ర కాంగ్రెస్‌లో చాలా మందికి నచ్చడం లేదు. ఏడాది పరిపాలన చేయడమే ఘనకార్యంగా కీర్తించడం కాంగ్రెస్‌పార్టీలో ముఖ్యమంత్రుల మనుగడ దౌర్బల్యానికి అద్దం పట్టేందని వారంటున్నారు. అయితే కోట్ల వారు ఇవేవీ పట్టించుకోకుండా ఏడాది పాలన ఉత్సవాన్ని రంగ రంగ వైభవంగా జరుపుకున్నారు. పత్రికల్లో ప్రత్యేక అనుబంధాన్ని ప్రచురింప చేసి వివిధ ప్రభుత్వ సంస్థల ప్రకటనలతో గుప్పించారు. రాష్ట్ర ప్రభుత్వం ఏడాదిలో సాధించిన విజయాల్ని

కొరవ 10 పేజీలో

# పేడ తట్ట పిసిసి

పిసిసి పీఠమంటే 'పేడతట్ట' వంటిదని మజ్జితులసీదాస్ అభివర్ణించారు. పిసిసి అధ్యక్షుడిగా పేడ తట్టను నెత్తిమీద పెట్టుకొని మోస్తున్నానని ఆయనంటున్నారు. "తట్టలోని పేడను జాగ్రత్తగా పట్టుకెళ్లి పొలంలో వేస్తే మంచి ఫలితాలొస్తాయి. అలా గాకుండా ఇతరుల మీద పేడ చల్లడం మొదలెడితే వచ్చే దుష్పరిణామా లెలా వుంటాయో అందరికీ తెలిసిందే. అందుకే నన్ను ఎవరెన్ని అన్నా పట్టించుకోకుండా వుంటున్నాను". అని తులసీదాస్ గారు సెలవిచ్చారు. ఇంతకూ తులసీ వ్యాఖ్యానం ఎవరి నుద్దేశించింది? తన మీద ఎవరన్నా బురద జల్లితే నెత్తిమీద పేడతట్ట వుంది జాగ్రత్త అన్న హెచ్చరిక ఈ వ్యాఖ్యానంలో ధ్వనిస్తోంది. కదూ! ఏది ఏమైనా ఈ మధ్య పిసిసి అధ్యక్షుడి వైఖరిలో మార్పు కొట్టొచ్చినట్లు

**మజ్జి వారి నిర్వచనం**

కనిపిస్తోంది. నిన్న మొన్నటి దాకా ముఖ్యమంత్రితో ఉప్పు-నిప్పు లా వున్న ఆయన సంబంధాలు ఇప్పుడు కౌగిలింతల దశకు చేరాయి. ఇటీవల జరిగిన కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ సమావేశంలో కోట వర్గీయులు తులసీదాస్‌పై రెచ్చిపోయారు. ముఖ్యమంత్రిపై కొందరు ఎమ్మెల్యేలు పని గట్టుకొని విమర్శిస్తున్నారని కోట్ల వర్గీయులు ఆ సమావేశంలో ప్రస్తావించారు. దానికి పిసిసి అధ్యక్షుడు స్పందిస్తూ " అవునవును. ఇది మంచి పద్ధతి కాదన్నారట ". దాంతో కోట్ల వర్గీయుల పిసిసి అధ్యక్షుడిపై మండిపడ్తూ " మీరు చేస్తున్నదేమిటండి? ముఖ్యమంత్రిని మీరు విమర్శిస్తున్నారు కదా? అసలు మీ అండ చూసుకొనే కదా ఎమ్మెల్యేలు రెచ్చిపోతున్నది అని మాటల తూట్లు పొడిచారు. వాటి

కొరవ 9 పేజీలో

## పెండేకంటి అస్తమయం

మాజీ గవర్నరు, మాజీ కేం[illegible] మంత్రి శ్రీ పెండేకంటి వెంకట సుబ్బయ్య 12 తేది హైదరాబాదులో కన్ను మూశారు. క్యాన్సర్ వ్యాధి



రూపంలో మృత్యువు ఆయన్ను కబళించింది.

కొరవ 9 పేజీలో

# వైఎస్ కథ అడ్డం తిరిగింది!

రాష్ట్ర కాంగ్రెస్ నాయకత్వం పై పులి వలె విరుచుక పడిన డాక్టర్ వైఎస్ రాజశేఖర రెడ్డి వున్నట్లుండి పిల్లి లాగా మారి పోయారు;వున్న ముఖ్య మంత్రిని, పూడిన ముఖ్యమంత్రులను తిట్టిన -తిట్టు తిట్టకుండా తిట్టి పోసిన రాజశేఖర రెడ్డి గారు ప్లేటు మార్చి "పాపం వాళ్లు మంచి వాళ్లేనండి" నంటూ కితాబు ఇచ్చేస్తున్నారు; ఆఫ్టరాల్ ప్రధాని అనగా ఎంత - పంతులయ్యే కదా అన్న ధోరణిలో ప్రవర్తి న వైఎస్ ఇప్పుడు పివి సాక్షాత్తూ కాంగ్రెస్ కులదైవం వంటి వాడంటూ కీర్తనలు పాడుతున్నారు.

**ఢిల్లీ నుంచి మొట్టికాయలు పడడంతో తిట్టిన నోటితోనే పొగుడుతున్నాడు!**

డామిట్ కథ అడ్డం తిరిగింది - అని అలనాటి గిరీశం పగచిన రీతిన ఇప్పుడీ రాజకీయ కిశోరం జీర్ణతృణంబు మేయడానికి సిద్ధ పడడంలోని పరమార్థమేమిటి? సింహం ఎండుగడ్డి మేయదన్న సిద్ధాంతాన్ని తలక్రిందులు చేయడం వెనుక అంతరార్థ మేమిటి?

రాష్ట్ర రాజకీయాలలో డాక్టర్ వైఎస్ రాజశేఖర రెడ్డి గారిది విలక్షణ శైలి. వేడి తగిలితే •ఇనుమైనా వంగుతుంది కాని, ఒకసారి ఒక దారికి మళ్లితే ఇంకెవ్వ రెంత చెప్పినా ప్రక్క చూపు చూడనంతటి సుదృఢ మనస్కుడని పేరు వచ్చింది. చెప్పుకో దగిన పదవి అంటూ ఏదీ చేపట్టక పోయినా ఇటు ప్రజల దృష్టిలో, అటు పార్టీ వర్గాలలో రాజశేఖర రెడ్డికి సీనియర్ నాయకుల సరసన సీటు వుంది. రాష్ట్ర కాంగ్రెస్ నాయకులలో ఏ జిల్లాకు వెళ్లినా కొద్తో గొప్పో జనాన్ని ఆకర్షించ గల్గిన శక్తి గల్గిన వాడు

కొరవ 9 పేజీలో

# నాటుసారా వరద రాష్ట్రాన్ని ముంచెత్తుతూంది!

అక్టోబరు 2 తేది నుంచి అమల్లోని రాష్ట్ర వ్యాప్త సారా నిషేధం పత్రికలతాల నిష్పతం లేదు. నిషేధం ప్రకటించి రెండు వారాలైనా దాని ప్రభావం కన్పించడం లేదు. రాష్ట్రం నలుమూలలా అక్రమ సారా వెల్లువ, పొరుగు రాష్ట్రాల నుంచి దొంగ సారా రవాణా, పెద్ద ఎత్తున నాటు సారా తయారీతో సారా నిషేధం నీరు కారి పోతున్నది.

రాజకీయంగా తెలుగుదేశం

> **నెల్లూరుజిల్లా ఉద్యమాన్ని చూసి అన్ని జిల్లాలలోనూ సారానిషేధించి ప్రభుత్వం పొరపాటుచేసిందా?**

వంటి ప్రతిపక్షాల విమర్శల తాకిడికి తట్టుకోలేక నిషేధం ప్రకటించడం తప్ప, దాన్ని చిత్తశుద్ధితో అమలు చేసే యంత్రాంగం ప్రభుత్వానికి లేక పోవడమే దీనికి కారణం. నెల్లూరు జిల్లాలో ఉద్యమాన్ని చూసి, రాష్ట్ర మంతటా నిషేధం అమలు చేసి ప్రభుత్వం పొరపాటు చేసిందా అన్న సందేహం కల్గుతున్నది. నెల్లూరు జిల్లాలో దాదాపు రెండేళ్లు ఉద్యమం నడిచింది. గ్రామ గ్రామంలో సారా ప్రమాదం పట్ల చైతన్యం తెచ్చే ప్రయత్నం జరిగింది. అప్పటి కలెక్టర్ శ్రీ కె. రాజా దీన్నొక ప్రజా సంస్కరణో ద్యమంగా నడిపించారు. ప్రభుత్వం వైపు నుంచి పూర్తి మద్దతు అందించారు మహిళలలో చైతన్యం రగిలించారు.దాని ఫలితంగా త్రాగుబోతుల లోనూ మార్పు వచ్చింది. ఇప్పటి కలెక్టర్ శ్రీ సాంబశివ రావు కూడా అదే ఉత్సాహంతో, పట్టుదలతో ఉద్యమానికి చేయూత నిస్తున్నారు. ఇతర జిల్లాలలో ఈ చైతన్యం లేదు; ఉద్యమం గ్రామాల వరకు ప్రాకలేదు; అధికార యంత్రాంగం నుంచి మద్దతు, ప్రోత్సాహం లేవు. కేవలం చట్టాన్ని అమలు చేసే దృష్టి తప్ప, సాంఘిక సంస్కర ణాభిలాష వ్యక్తం కావడం లేదు. అందువల్లే నిషేధం నెల్లూరులో వలె ఇతర జిల్లాలలో, మరీ ముఖ్యంగా రాయలసీమ, తెలంగాణా జిల్లాలలో సఫలీకృతం కావడం లేదు. ఎక్సైజ్ సిబ్బంది రెండు నాటు సారా బట్టీలు పగల గొడితే నాలుగు కొత్తవి పుట్టు కొస్తున్నాయి. సారా నిషేధం కోరుతూ రోడ్ల మీదకు వచ్చిన ఆడపడుచుల్లో కొందరు దొంగ సారా అమ్మకాల పై ఆధార పడి బ్రతుకుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. తెలంగాణా ప్రాంతంలో కారు చౌకగా లభించే గుడుంబా వ్యాపారం పూపందుకున్నది. గిరిజన తండాల్లో నాటు సారా పొయ్యిలు పెద్ద ఎత్తున మండుతున్నాయి.

కర్నాటక, మహారాష్ట్రల నుంచి దొంగ సారా లారీలకు లారీలు రాష్ట్రంలోకి ప్రవేశిస్తున్నది. అయా రాష్ట్ర

కొరవ 6 పేజీలో

# సణుగుడు

* ఈవయస్సులో ఎన్‌సిచేయాల్సినపనేనా?
* గవర్నర్‌మంచిమాటచెప్పారు

ఎన్టీఆర్ కొత్త సతీమణి లక్ష్మి పార్వతి దేవి దర్శనం చేసుకొని తరించారట- ఎన్.సి. పూలమాల కూడా వేసి పులకించి పోయినట్లున్నారు. నెల్లూరు నుంచి తెలుగు దేశం నాయకులు చాలా మందే హైదరాబాదు వెళ్లి అన్నగారి కొత్త కాపురం చల్లగా నూరేళ్లు సాగాలని ఆశించి, శుభం పల్కి మరీ వస్తున్నారు. తన పతిదేముడి కాళ్లకు మొక్కడానికి క్రిందకు వంగే తెలుగు బానిసల చేతికందేటట్లు తన కాళ్లనూ జరిపి వారికి శ్రమ లేకుండా చేస్తున్నారటఆ పతివ్రతా శిఖామణి. అన్నగారి పాదపద్మాలతో పాటు అమ్మగారి చరణ ద్వయాన్ని కూడా భక్తితో కళ్లకద్దు కుంటున్నారు అందరూ. కాళ్లు పట్టే నీచత్వానికి దిగ జారిన తర్వాత అవి ఎవరి కాళ్లయితే ఏమి? ఆడవాళ్ల కాళ్లయితే ఇంకా మెత్తగా, మృదువుగా వుంటాయి కదా! ఎన్‌సి అంతటి పాడు పని చేసి వుంటాడని నేననను కాని, డెబ్బయ్‌ఏళ్ల ముసలి ముప్పందాన ముష్టి పదవులకోసం మనసు చంపుకొని ఎన్టీఆర్ చేసిన వికృత వికార చేష్టలను అభినందించి వచ్చాడంటేనే బాధగా వుంది. ఎన్టీఆర్ కామ పైత్యం

**డోలేంద్ర**

బయటకు అవులిన శృంగార లీల వలె వుందని భజన చేసినా- అందరి మనసులలోనూ ఏహ్యాభావం వుండేది నిజం. రాజకీయాలలో కొత్త బిచ్చగాళ్లు, పదవులు లేకుంటే బ్రతక లేమనే కక్కుర్తిగాళ్లు అన్నకు, అమ్మకు కూడా పాద పూజ చేసి, భజన కీర్తనలు పాడి రావడంలో అర్థం వుంది. కాని ఎన్‌సికి ఎందుకా ఖర్మ? ఇంకా ఏ పదవులొస్తాయని భ్రమ పడుతున్నారాయన. ఈ వయస్సులో అంత ఆత్మవంచనకు పాల్పడడం అవసరమా?

* * *

గవర్నర్ గారు మంచి మాట చెప్పారు - రాజకీయ నాయకులంతా రౌడీలు, గుండాలు అని! పోలీసు యంత్రాంగం సమస్తం నేర మయమని ఆయనే అన్నారు. జనమంతా రోజూ అనుకునే మాటలే ఇవి. కాని గవర్నర్ అంతటి వాడు అంత మాట అనేటప్పటికి దానికి విలువ వచ్చేసింది.

సాధారణంగా గవర్నర్లు పలికితే నోటి ముత్యాలు రాలుతా యన్నట్లు వుండి పోతుంటారు. అంతగా అయితే ప్రభుత్వం తరపున అధికారు లందించే కాగితాలను చదివి చిలక పలుకులు పలుకు తుంటారు. కాని కృష్ణ కాంత్ అందరి వంటి వాడు కారు. కరడు గట్టిన సోషలిస్టు, సామాజిక శాస్త్రానికి భాష్యం చెప్పగల్గిన మేధావి. రాజకీయాలలో నీతి, నిజాయితీ, సంస్కారం, ప్రజాశ్రేయోభి లాష వుండాలని మొదటి నుంచి పోరాడుతున్న వాడు. విలువల కోసం పడి చచ్చేవాడు. పదవుల కోసం ప్రాకులాడిన వాడు కాదు. అందువల్లే అంత నిక్కచ్చిగా, ఘంట బ్రద్దలు

కొరవ 6 పేజీలో

## ప్రకృతి - మనిషి

\- రసిక్

ఈ వచ్చిన భూకంపం
ఏమని చెబుతోంది మనకు?
కంపించింది భూమి కాదని
కంపిస్తోంది మన గుండె దిటవని

* * *

శోధిస్తున్నామని, సాధిస్తున్నామని
ఛేదిస్తున్నామని, భేదిస్తున్నామని
పాలిస్తున్నామని, శాసిస్తున్నామని
నియమిస్తున్నామని, నియంత్రిస్తున్నామని
ఆహా, మనకెవరు సాటి
ఇహలోకంలో
అహో, మనకెవరు పోటి
ఇహ ఈ లోకంలో
అని మనిషి విర్రవీగినంత సేపూ
అని మనిషి పెట్రేగినంత మేరా
అని మనిషి కొనసాగినంత దవ్వూ
వీగనిచ్చి, రేగనిచ్చి, సాగనిచ్చి
పగలబడి నవ్వుతుంది ప్రకృతి
ఆ నవ్వుల తెరలే
నమ్ము కొన్ననేల కంపించి నట్టూ
నమ్ము కొన్న కడలి ఉప్పెనలాగా విరుచుక పడ్డట్టూ
నమ్ముకొన్న మబ్బు ముఖం తప్పించి నట్టూ
మరెన్నో విధవిధాలుగా, శతవిధాలుగా
ఆయా సందర్భాల్లో అన్ని వైపుల నుండీ
మనిషిని క్రమ్ముకొస్తాయి, కప్పివేస్తాయి

* * *

తెప తెపా మనిషి
ఉక్కిరి బిక్కిరౌతూనే వుంటాడు
బిక్క చచ్చి పోతూనే వుంటాడు
దిగ్భ్రాంతిని వెలిబుచ్చుతూనే వుంటాడు
అంతా ఆ కాస్త సేపే
ఆ వెనుక మాయ క్రమ్మి వేస్తుంది
మళ్లీ కథ మొదలు
ప్రకృతిపై మనిషి సవారీ మొదలు
జాటి దెబ్బలు తినితిని రెచ్చి పోయిన
జవనాశ్వం కాళ్ళ క్రింద రౌతు పాట్లు మొదలు

* * *

మనిషికర్థం కాకుండా
ఒక సత్యం మిగిలి పోతూనే వుంటుంది
''ప్రకృతిలో మనిషి ఒకానొక తునుక యైనపుడు
ఆ తునుక తన్ను తాను యజమానిగా
ప్రకటించు కోవడం పరిహాసాస్పదమని —
ప్రకృతిని గులాముగా భావించడం మానివేసి
దాని పట్ల వినయంతో మసలు కోవడం మంచిదని''

# రాపూరుచెరువును ఆక్రమించిసాగు చేసుకుంటున్నారు!

**జిల్లావార్తలు**

రాపూరులోని దాబాల చెరువు ఆక్రమణలకు గురై పంట పొలంగా మారి పోతున్నది. రెండు వేల ఎకరాల ఆయకట్టు కల్గిన పెద్ద చెరువు ఇది. వర్షాధారంతో తప్ప పంటలు పండించలేని ఈ ప్రాంతంలో రైతాంగానికి ఎంతో ఉపయుక్తమైనది. అయితే కొందరు రైతులే చెరువులో తమకు తోచిన భాగాన్ని ఆక్రమించుకొని, ఫెన్సింగ్ వేసి, దావులు త్రవ్వుకొని పైర్లు సాగు చేస్తున్నారు. మట్టి తోలి ఎత్తు పెంచు తున్నారు. దీని వల్ల చెరువులో నీరు నిలవడం లేదు. వచ్చిన నీరు వచ్చినట్లే కలుజ ద్వారా క్రిందకు కారిపోతున్నది. గత ఏడాది చెరువు ఎండిపోయి, పైర్లకు నీరందక నష్టపోయారు. ఈ సంవత్సరమూ పంట చేతి కంది వచ్చే సమయంలో చెరువు ఖాళీ అయిపోయింది. ఎమ్మెల్యే శ్రీ నువ్వుల వెంకట రత్నం నాయుడు, సర్పంచ్ బత్తిన పట్టాభిరామ రెడ్డి చొరవ తీసుకొని, కిలో మీటరు దూరంలోని ఒక గుంటలోని నీటిని మోటార్ల ద్వారా పంప్ చేయించి, చెరువు నింపి పంటలు కాపాడారు.

ఆక్రమణలు తొలగిస్తే ఈ దుస్థితి ఏర్పడదు. వానా కాలం సహజంగా వచ్చే నీటితోనే చెరువు నిండి, పూర్తి పంటకాలం పైర్లకు నీరందుతుంది. అయితే ఆక్రమణ దారులు ప్రభుత్వ ఉద్యోగులు కావడం వల్ల పిడబ్ల్యుడి శాఖ చూసి చూడనట్లు వుండి పోతూంది. ఎవరో కొందరి ప్రయోజనం కోసం రెండు వేల ఎకరాల ఆయకట్టును పాడు చేయడం అన్యాయం. ఎస్.ఇ. గారు వెంటనే చెరువు పరిస్థితి చూసి, తక్షణం ఆక్రమణలను తొలగించాలని రైతుల కోరిక.

## పూడ్చని గుంటలతో కాళ్లు విరుగుతున్నాయి!

రాపూరు టెలిఫోన్ ఎక్స్ఛేంజి ఆధునీకరణ కోసం, టౌన్‌లో ఐదేసి

కొరవ 6 పేజీలో

# జమీన్‌రైతు
## అనావృష్టి-అతివృష్టి

గొంతార్చుకపోయే దాహానికి నాలుగు చుక్కల నీళ్లు రాల్తాయన్న ఆశతో ఆకాశం వైపుకు నిక్కి చూస్తుంటిన మహబూబ్ నగర్ ప్రజానీకాన్ని వరదలతో ముంచెత్తి, కొంపలు ముంచేశాడు వరుణదేముడు. నిన్నటివరకు కరువుతో అల్లాడిన జనం నేడు వరదలతో ఊపిరాడక విల విల లాడుతున్నారు. మహబూబ్ నగర్ ఆకలి చావులకు పెట్టింది పేరు. అక్కడ బొట్టు నీరు దొరకదు. ప్రతిఏటా కరువే. భూగర్భ జలం లేదు. వానలపైనే వ్యవసాయం ఆధారపడాలి. అవి ఎప్పుడూ సక్రమంగా కురవవు. నెలల పర్యంతం వున్న వూళ్లు వదలి దేశంలో ఎక్కడ పని దొరికితే అక్కడకు వలస వెళ్లడం అక్కడి పేదల కలవాటైపోయింది. కాశ్మీర్ నుంచి కన్యాకుమారి వరకు నీటి పారుదల ప్రాజెక్టులలో కంట్రాక్టర్ల దగ్గర పనిచేసే "పాలమూరు లేబరు" మహబూబ్ నగర్ పేదలే! చాలా గ్రామాలలో జన సంచారమే వుండదు. లేవలేని ముదుసలులు, పనిపాటకు పనికిరాని పసి పిల్లలుమాత్రం ఇళ్లలో వదలి పొట్టచేత పట్టుకొని ఎక్కడెక్కడికో వెళ్లడమే ఇందుకు కారణం. తరాల తరబడి కరువు కోరలలో చిక్కి విలపించే ఈ దీనులపైన ప్రకృతి వరదల రూపంలో విరుచుక పడడం కంటె ఘోరం ఇంకొకటుంటుందా? తుంగభద్ర వున్నట్లుండి పొంగడంతో దాదాపు వంద గ్రామాలు జలమయమైనాయి. 9 వేల ఇళ్లు కూలి పోయాయి; నీట మునిగి పది ముగ్గురు చచ్చారు. నిన్నటివరకు నీటి తడి ఎరుగక బీటలు వారిన చెరువులు రాత్రికి రాత్రి నిండి, పొర్లి, గట్లు తెగి వూళ్లను ముంచెత్తి, తెల్లారే సరికి మళ్లీ వట్టిపోయాయి. దీనివల్ల ఇంత పెద్ద వరద వచ్చినా ఆ దురదృష్ట జిల్లాలో కరువు మాత్రం తీరలేదు, తీరదు కూడా!

ప్రకృతితో పాటు, ప్రభుత్వాలు కూడా ప్రజానీకంతో ఆడే చెలగాటల దుష్ఫలితం ఇది. వేడి సోకిన మైనం ముద్దల్లాగా, నీటి తడి తగలగానే చెరువు కట్టలు కరిగి, గండ్లు పడడం మనిషి, మనిషికి చేస్తున్న ద్రోహమే కదా! ఇంజనీర్ల అవినీతి, కాంట్రాక్టర్ల కక్కుర్తి వల్ల పల్లెల్లోని నీటి వనరులు ప్రజలకుపయోగ పడకుండా పోతున్నాయి. ఇంకొక ప్రక్క అధునాతన సమాచార వ్యవస్థలున్న ఈ రోజుల్లో కూడా వరదల గురించి ప్రజలను ముందుగా హెచ్చరించలేని, వూళ్లు ఖాళీ చేయించి సురక్షిత ప్రదేశాలకు తరలించలేని ప్రభుత్వ అసమర్థత గర్హనీయమైనది. అధికారులు ఏమాత్రం ముందు హెచ్చరిక చేసి వుండినా ఇంతటి విధ్వంసం జరిగి వుండదు. భవిష్యత్‌లోనైనా అన్ని నదుల దిగువభాగాలకూ సత్వర సమాచార మార్పిడికి ఏర్పాట్లు చేయడం అవసరం.

## పాకిస్తాన్ అనిశ్చిత స్థితి

పాకిస్తాన్‌లో స్వేచ్ఛగా ఎన్నికలు జరిగి, ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పాటుకు మార్గం సుగమం కావడం ముదావహం. నవాజ్ షరీఫ్ ప్రభుత్వం పతనంతో మరొక సారి ఆ దేశం సైన్యం హస్తగతమౌతుందన్న భయసందేహాలు తొలగిపోయాయి. అయితే దురదృష్ట వశాత్తు ఎన్నికల్లో ఏ పార్టీకీ తగినంత మెజారిటీ రాలేదు. బెనజీర్ భుట్టో పీపుల్స్ పార్టీకి అత్యధిక సంఖ్యలో పార్లమెంట్ స్థానాలు లభ్యమైనా, స్వతహాగా ప్రభుత్వం నెలకొల్పే సంఖ్యాబలం లేదు. 208 మంది సభ్యులున్న సభలో ఆమెకు 92, నవాజ్ షరీఫ్ పార్టీకి 75 మంది సభ్యులు లభించారు. ప్రభుత్వం ఏర్పాటుకు కనీసం 105 మంది కావాలి! స్వతంత్రులు, ఇతర చిల్లర మల్లర పార్టీలను కలుపుకొని తనకు 107 మంది సభ్యుల బలం వుందని భుట్టో చెప్తున్నారు. అదే నిజమైతే ప్రభుత్వం ఆమెదే. కానీ నవాజ్ షరీఫ్ అసాధ్యుడు. పాకిస్తాన్‌లోని అతి పెద్ద పారిశ్రామిక కుటుంబాలలో ఆయన దొకటి. ధనబలం అపారం. అందువల్ల ఎన్ని కోట్లయినా వెచ్చించి పార్లమెంట్ సభ్యులను కొనడానికి ప్రయత్నిస్తున్నారు. 18 తేదీ లోగా బలాబలాలు నిర్ణయం కావాలి! ఈలోగా నవాజ్ షరీఫ్ ఏమి చేస్తాడో వూహించడం కష్టం. పార్లమెంట్ సభ్యుల మధ్య ఫిరాయింపుల పర్వం ప్రారంభమౌతుంది. కేంద్రంతోపాటు పంజాబ్ రాష్ట్రంలో కూడా ఎవరికీ మెజారిటీ రాలేదు. కేంద్రంలో ఎవరు ప్రభుత్వం ఏర్పాటుచేస్తే వారికి మద్దతు ఇవ్వడానికి అక్కడి స్వతంత్రులు సిద్ధంగా వున్నారట. చాలా కీలకమైన రాష్ట్రం ఇది.

షరీఫ్ కాని, భుట్టో కాని ఎవరో ఒకరు ప్రభుత్వం ఏర్పాటు చేయడం ఖాయం కావడం సంతోషదాయకంగానే భావించాలి. వారిలో ఎవరు పెత్తనం స్వీకరించినా పాకిస్తాన్‌లో ప్రజాస్వామ్యం పదిలంగా వుంటుంది. లేకుంటే సైన్యం చేతిలో పడి ప్రజలు నానా బాధలు పడవలసి వచ్చేది. 18 తేదీ లోపల అనిశ్చిత స్థితి తొలగి బెనజీర్ భుట్టో ప్రభుత్వం ఏర్పాటు చేయగల్గుతుందని ఆశిద్దాం! ఇస్లాం మత పద్ధతు లాధారంగా నడిచే దేశంలో, ఛాందస మతావలంబన వున్నదేశంలో ఒక మహిళా నాయకురాలు ప్రజాభిమానం పొందగల్గడం ఆశ్చర్యకరం.

# జమీన్‌రైతు

15.10.43

6 పేజీలు, 0-1-6

### మధుకణాలు

#### ఫిడేలు రాగాల డజన్

- పఠాభి

"గ్రంధమున తెందమును బందిగొనునది రసస్ఫూర్తి గాని కబ్బము యొక్క బాహ్య రూపము (పద్యము ఒండె - గద్యము) కాదు గదా?

- దుర్వాసుబ్రంహ్మణ్య శర్మ గారు"

ఔను! శర్మగారన్న మాట ముమ్మాటికి నిజము! యువకవి, నవకవి, భావకవి, పఠాభి రచించిన "ఫిడేలు రాగాల డజన్" నుండి మీకు కొన్ని మధు కణాలు రాల్చపెడతాను. చవిజూడండి! యతిగణ ప్రాస లక్షణ బాహ్య జగత్తును మరచి చదువండి. కవి చిత్రజగత్తులో ఏలా విహరిస్తాడో? ఊహాగానంలో ఏలా విముగ్ధుడౌతాడో? నిరంకుశంగా భావ ప్రపంచంలో ఏలా రెక్కలు గట్టుకొని స్వేచ్ఛగా విహరిస్తాడో? మనలగూడ మైమరపించి ఏలా తన తోగూడ లాక్కు పోతాడో? అర్థమౌతుంది. కవిత్వాన్ని అంగెలు అరిగిపోయిన కొల్తబద్దతో కొలిచి మాత్రం పొరపాటు లెక్కలో పడిపోగండి.

- సంపాదకుడు

### మద్రాస్ పై జపాన్ బాంబులు

ఈ 11 తేది రాత్రి పూట, ఒకే ఒక జపాన్ పర్యవేక్షణ విమానం, మద్రాస్ నగరం మీదకు వచ్చి కొన్ని బాంబులు వేసింది. మిలిటరీ నష్టం లేదు. సివిలియన్ నష్టాలు మాత్రం కొద్దిగా వున్నాయి. నగరాన్ని, ఖాళీ

**50 ఏళ్ల క్రితం ఈ వారం**

చేసి పోవాలనే గందరగోళంలో పడకుండా, పట్టణం ప్రశాంతంగా జీవితం గడుపు తున్నది అని ప్రభుత్వ ప్రకటన.

అదే రాత్రి సిలోన్ తూర్పు కోస్తా ప్రాంతాన ఒక జపాన్ విమానం, బాంబులు వేయకముందే, పడగొట్ట బడింది.

### మద్రాస్‌లో వరదలు

పదిహేను రోజులుగా విపరీతమైన వర్షాలు కురిసినందుకు, మద్రాస్ నగరం చాలా భాగం జలమయమైంది. కొన్ని పేటలలో, మొలలోతు నీళ్లున్నాయి. రోడ్లమీద అడయార్, కూమ్ నదుల గట్లు పొంగి వరదలు వచ్చి పడ్డాయి. ఈ వరదల మూలాన పేదవారి గుడిసెలన్నీ పోయినాయి. కేవలం నిరాధారులగు వారికి అన్నదానం జరుపుతున్నారు.

ఈ వరదలు, వర్షాలు మూలంగా, సిటీలో ప్రయాణ సౌకర్యాలు వగైరాలన్నీ నిల్చి పోయినాయి గూడ. ప్రస్తుతం ఆ చిక్కంతా తీరి పోతున్నది. పరిస్థితి తీవ్రత తగ్గిపోతుంది.

మద్రాస్‌లో వర్షాల మూలంగా ఇండ్లు కూలి 12 గురు మరణించారు.

### గూడూరు న్యూస్ రీల్

మా బ్రదరు రెడ్డి కుర్రోడొకడు కోవూరు నుంచి వస్తూ వుంటే సాటిలేని నెల్లూరు పిక్‌పాకెట్ దెబ్బ తగిలి తన చొక్కా క్రింద బనీను ప్రక్క జేబిలో నుంచుకొని పిన్నుకుట్టి భద్రపరచుకొన్న రూ. 1000 అక్షరాల వెయ్యి రూపాయలు (నోట్లు) యెగిరి పోయినవి.

* * *

గూడూరు టార్జాన్ భారతి పందెం గట్టుకొని తెల్లి తెనీరు త్రాగేశాడు. ఎట్లనో దేవుడి పుణ్యాన వుండి పడిపోయిన గొంతు ప్రేగులు మానువు కున్నాడు.

# సెక్స్ ఒక దివ్యౌషధం!

వయస్సు మళ్లిన స్త్రీ పురుషులకు సెక్స్‌లో ఆనందాన్ని పొందవలసిన అవసరం లేదని, అది అసంభవమని పలువురి అభిప్రాయం. కానీ, యే వయస్సులోనైనా సెక్స్ అవసరమని, సంభవమని సెక్సాలజిస్టుల అభిప్రాయం. కావల సిందల్లా సెక్స్ సైకాలజీని అవగాహన చేసుకుని, వయస్సు మూలంగా శరీరంలో యేర్పడే మార్పులకు అనుగుణంగా మనస్తత్వాన్ని మార్చుకోవడం. ప్రస్తుతం అభివృద్ధి చెందిన దేశాలలో సెక్సాలజిస్టులను సంప్రదించే వాళ్లలో అధిక సంఖ్యాకులు యాభైకి పైబడినవాళ్లే. అంతేగాక వృద్ధాప్యంలో స్త్రీ పురుషులకు సంభవించే కొన్ని రుగ్మతలకు సెక్స్ ఔషధంగా పనిచేస్తుందని కొన్ని పరిశోధనలలో

**జనవాణి**

తేలింది. జూలై 1993 రీడర్స్ డైజెస్ట్ లో వెలువడిన "ది హీలింగ్ పవర్స్ ఆఫ్ సెక్స్(THE HEALING POWERS OF SEX) " అనే వ్యాసాన్ని పరిశీలిస్తే ముందు ముందు సైంటిస్టులు" సెక్స్ దివ్యౌషధం". అన్నా ఆశ్చర్య పడవలసిందేమీ లేదు.

-డా. ఐ. రాజగోపాలరెడ్డి

నెల్లూరు.

### మందులంగళ్ల గుమాస్తాల గోడు

మందులంగళ్లలో పనిచేసే గుమాస్తాల వెట్టిచాకిరీ గురించి ఆ మధ్య మీ పత్రికలో ఒకసారి వ్రాశారు. కానీ దాన్ని పట్టించుకున్నవారు లేరు.

కొరవ 10 పేజీలో



జననం:1.7.1936 మరణం: 6.10.1993

# ఉత్తరక్రియలు

మా తండ్రి

## జల్లి చెంగయ్య గారు

6.10.93 తేది బుధవారం స్వర్గస్థులైనారు వారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తూ వారి ఉత్తరక్రియలు

20.10.93 తేది బుధవారం

నెల్లూరు వెంకట్రామాపురంలోని మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

జల్లి శ్రీనివాసులు - వెంకటేశ్వర్లు

టి. హైమావతి - ఎమ్. నిర్మల

భార్య : జల్లి రాఘవమ్మ

కోడళ్లు: ప్రమత - సుజని

అల్లుళ్లు: టి. సుధాకరరావు, ఎమ్. చంద్రశేఖర్

అప్పుడు: ఎస్.కె. అహ్మద్

Adarsha Ads.



[illegible] అనం వివేకానందరెడ్డి, నారాయణ, ప్రిన్సిపల్ కృష్ణమోహన్, స్టేట్‌బ్యాంక్ అధికారులు.

# నారాయణ మహిళా కాలేజి నెల్లూరుకే అందం తెచ్చింది!

కోచింగ్ సెంటర్ల నిర్వహణలో అసమాన ప్రతిభ కనబరచి, అంచెలంచెలుగా పైకెదిగిన నారాయణ, తన పేరుతోనే ఒక మహిళా కాలేజి నెలకొల్పారు. చింతారెడ్డి పాళెం గ్రామంలో పాతికెకరాల సువిశాల విస్తీర్ణంలో నిర్మితమైంది కాలేజి. ఎన్ని లక్షలైందో, లేక కోటికూడా దాటిందో తెలియదుకాని, భవనాలు మాత్రం చూడ ముచ్చటగా వున్నాయి. ఒక్కొక్క బ్లాకులో కేవలం ఇరవైమంది విద్యార్థినులు మాత్రమే వుండేటట్లుగా డిజైన్ చేశారట. దీనివల్ల మూకుమ్మడి సమస్యలు తగ్గి, పిల్లలు ప్రశాంతంగా చదువుకోగల్గుతారని అంచనా. మొత్తం 500 మంది విద్యార్థినులకు సరిపడా హాస్టలు, కాలేజి వసతులున్నాయి. ఇంటర్మీడియట్ సైన్సు గ్రూపులు మాత్రం ప్రవేశ పెట్టారు. ఏడాదికి 18 వేల ఫీజు.

ఈ భవనాల ఆర్కిటెక్ట్ శ్రీ మోహన్‌రెడ్డి; మోహన్‌రెడ్డి సంగతి తెలిసిందే కదా- అవి కాలేజి భవనాలన్న సంగతి మర్చిపోయి సినిమా స్టార్ల రిసార్టుల మాదిరి అలంకరించేశారు. చివర్న లెక్కలు చూసుకొని నారాయణ గుండె పగిలి వుంటుంది!

ఇప్పటి వరకు డికెడబ్ల్యు కాలేజి అందమైన విద్యా సంస్థగా వుండేది. నారాయణ దాన్ని మించి

## చదువు 'కొనే' వారికి భలే మంచి చోటు!

పోయి తన భవన సముదాయాలతో నెల్లూరుకే అందం తెచ్చారు.

కాలేజి ప్రక్కనే మరొక 75 ఎకరాల స్థలం వుంది. అందులో ఎల్‌కెజి నుంచి 10 తరగతి వరకు అంతర్జాతీయ ప్రమాణాలతో ఒక స్కూలు నెలకొల్పాలన్నది నారాయణ తలంపు. బహుశా వచ్చే ఏడాదికి అదీ రూపు దిద్దుకోవచ్చు.

మహిళా కాలేజి ప్రారంభోత్సవం 30 తేది జరిగింది. స్టేట్ బ్యాంక్‌లో ఎందరు ఉన్నతాధికారులున్నారో అందరినీ రప్పించారు. జిఎం నుంచి బ్రాంచి మేనేజర్ దాకా హాజరు. చింతారెడ్డి పాళెం స్వగ్రామస్తుడని కాబోలు- శ్రీ ఆనం వివేకానందరెడ్డిని పిల్చి ఒక బ్లాక్ ప్రారంభింప జేశారు. శ్రీ ఆనం భక్తవత్సలు రెడ్డికి సన్మానం చేశారు.

## ధ్యాన శిక్షణ

నెల్లూరులోని శ్రీ దివ్యప్రకాశ కేంద్రం అక్టోబరు 18 నుండి20 తేది వరకు పర్మనెంట్ ఫండాఫీసులో ధ్యాన శిక్షణా తరగతులు నిర్వహించబోతున్నది. ఉదయం 8నుంచి రాత్రి 8 గంటల వరకు శిక్షణ వుంటుంది. వివరాలు ట్రంకురోడ్డులోని వెన్నెల ఐస్ క్రీమ్స్ ఎదురుగా శ్రీ చివుకుల మాలకొండయ్య ఇంట్లో సంప్రదించవచ్చు.

## అధునాత భగవద్ 'గీత'

ఇది
కలల కాలం కాదు
కలికాలం!
పనుల కాలం!!
ఇక్కడ
ఫలితానికె ప్రాముఖ్యం
విజయానికె ప్రాధాన్యం!
ఈ కాలం-
పనిని గుర్తించబోదు
కేవలం కృషిని హర్షించదు
ఆకాంక్షించేది గమ్యాన్ని
ప్రేమించేది లక్ష్యాన్ని!
సహృదయతకు పట్టంకట్టే
వ్రతం లేదిక్కడ!
సమర్థతను ప్రేమించే
అభిమతం వెల్లివిరుస్తున్న దిక్కడ!
మంచితనం నీడల్లో
జడత్వాన్ని పెంచుకుని
ఆశయాల పేర అలమటిస్తూ
కదలికని పాలేసుకుని
నిస్తబ్దంగా నిస్తేజంగా
నత్తలా నడుస్తూ
జయంనీదరికి రాలేదని
నీ వంతు కృషి చేశానని
ఋషి కాబోకు!
అర్ధదార్ల నడవలేకనే
చతికిల బడ్డానని బుకాయించి
విశ్రాంతి కోరల్ని ఆశ్రయించి
సముద్రమై సాగించాల్సిన
పయనం
సోమరితనం పాలబడ్డ ఓ మనిషీ
నీవు-
చేవచచ్చిన ఓ నగిషీ!
ప్రతి క్షణం యుద్ధంగా మారి
[illegible]
కర్తవ్య నిర్వహణా యజ్ఞంతో
సంతృప్తిని ప్రకటించడం
కాదు కావలసింది
ఫలితోన్ముఖుడవై పరుగెత్తడమే
ఈనాడు నీవు చేయవలసింది!
జయభేరి మ్రోగించడమే
ఈనాటి పథం
ఇదే అభినవ మానవ గీతం
ఇదే అధునాతన భగవద్గీత!

- చిన్ని నారాయణ రావు

# వానల్లో రోడ్లు త్రవ్వి ప్రాణం తీయడమెందుకు?

[illegible] కూడా వచ్చు - [illegible] జోనలో [illegible] కళ్యాణ మండపం నుంచి పత్తిఖాన్ పేట వరకు రోడ్డులో ప్రయాణం చేసి [illegible] రోడ్డు త్రవ్వేశారు. త్రవ్విన ఎర్రగులక నంతటినీ రోడ్డుపైనే క్రుమ్మరించారు. వాన కది రెండు పార్లు మడక దున్నిన వారు కయ్య [illegible] మాదిరి తయారై పోయింది. ఆటోల వంటి చిన్న చిన్న వాహనాలు అందులో కూరుకు పోతున్నాయి. సైకిలో [illegible] పోవాలన్నా ప్రాణానికొస్తున్నది. నడిచిపోయేవారి వొళ్ళంతా ఎర్రటి బురద మరకల చిలకరింపు. అప్పటికీ పోలీసులు [illegible] లేకుండా రోడ్లో [illegible] లారీలు, బస్సుల వంటి వాహనాలను [illegible] వస్తున్నారు. వారంత [illegible] ప్రయత్నించినా [illegible] తప్పించుకొని వచ్చేస్తున్నాయి. అవి ఆ [illegible] దారిలో నడవలేక ట్రాఫిక్‌లో చిక్కుబడి పోతున్నాయి. వాటిని ఎట్లో దాటించే వరకు ఎక్కడి ట్రాఫిక్ అక్కడ బంద్.

కల్వర్టులు వెడల్పు చెయాల్సిందే; రిపేర్లు జరిపించాల్సిందే. కాని దానికి ఇదా సమయం? ఈ వానల్లోనా రోడ్ల త్రవ్వకాలు? వాన కురిస్తే త్రవ్విన కందకంలో నీళ్లు నిల్చి పోతున్నాయి. వాటిని పంపులు పెట్టి రోడ్లోకి తోడుతున్నారు. అంతంత పరిమాణంలో నీళ్లు పారితే నిలవడానికి మన రోడ్లేమైనా తారు పోసి వేసినవా? కంకరకు తారు వాసన చూపించి వేసిన రోడ్లలో నీళ్లు పారితే ఏమి జరుగుతుంది? పెచ్చులు పెచ్చులుగా వూడి, బీభత్సంగా తయారౌతున్నాయి.

ఎండలు కాసినన్ని రోజులూ ఎక్కడ నిద్రపోతుండినారు? ఏ మార్చిలోనో, ఏప్రెల్‌లోనో పని మొదలు పెట్టి వుంటే ఈ బాధ వుండేదా? నిధులు వస్తుండేది తుఫాన్ అత్యవసర పునర్నిర్మాణ పథకం క్రింద; తుఫాన్ వచ్చేనెలలో పని మొదలు పెట్టారంటే

## నెల్లూరు సంగతులు

మన అధికార్లకు మతి వుందను కోవాలా, వద్దా?

• ఒక్క టౌన్‌లోనే కాదు - నేషనల్ హైవే మీద కూడా ఇదే పొరపాటు చేస్తున్నారు. మొన్న 9 తేది రాత్రి ఇటువంటిదే ఒక డైవర్షన్ రోడ్డులో ఒక లారీ ఇరుక్కుని పోయింది. రాకపోకలు ఆగిపోయాయి. అప్పయ్యగేటు నుంచి నెల్లూరు టౌన్ పొలిమేరల్లో బాలాజీ స్టీల్ ఫ్యాక్టరీ వరకు వాహనాలు నిల్చి పోయాయి. ప్రక్కరోజు సాయంత్రానికి కాని క్లియర్ కాలేదు. అప్పటికి నెల్లూరు వైపు నుంచి మద్రాసు వెళ్లే వాటిని ముత్తుకూరు మీదుగా మళ్లించి వెంకటాచలం దగ్గర కలిపారు; నెల్లూరుకు వచ్చే వాటిని మనుబోలు నుంచి పొదలకూరు మీదుగా పంపారు. ఎంత దూరాభారం? ఎంత శ్రమ? దాదాపు 16 గంటలు ట్రాఫిక్ చిక్కుముడిలో చిక్కుక పోయిన లారీలు, బస్సుల అవస్థ వర్ణనాతీతం.

ఇంజనీర్లకు ఆ మాత్రం ఆలోచనా వుండదా?

## పద్మావతి స్కూలు కరస్పాండెంట్‌కు సన్మానం

దర్గామిట్ట, పద్మావతి హైస్కూలు కొత్త కరస్పాండెంట్ శ్రీమతి టి. అనూరాధను అదే స్కూలు ఆవరణంలో అయ్యవార్లు, పిల్లలు కలిసి ఘనంగా సన్మానించారు. స్కూలును స్థాపించి, సమర్థంగా నిర్వహించి, కృష్ణానది ఆర్‌టిసి బస్ ప్రమాదంలో దురదృష్టవశాత్తు మరణించిన శ్రీమతి డి. నాగమణి స్థానంలో ఆమె కుమార్తె అయిన అనూరాధను కరస్పాండెంట్‌గా నియమించారట. ఆ సందర్భంలో జరిగింది సన్మానం. డిఇఒ శ్రీ ఆర్ నాగేశ్వరరావు అధ్యక్షించారు. గూడూరు ఎమ్మెల్యే శ్రీ పత్రా ప్రకాశరావు మాట్లాడారు.

ఇదే సభలో - ఈ ఏడాది జిల్లా స్థాయిలో ఉత్తమ ఉపాధ్యాయుడుగా ఎంపికైన శ్రీ కె.దాసు, చిత్రలేఖన పోటీలో ప్రథమ బహుమతి పొందిన ఉపాధ్యాయురాలు శ్రీమతి సరళాదేవిని కూడా

కొరవ 8 పేజీలో

## నెల్లూరు ముచ్చట్లు
### విలక్షణుడు

#### వాన

కరువు తీరా కురిసింది వాన ఈ వారమంతా మబ్బు చినుకులే. బంగాళా ఖాతం అల్ప పీడనాలు వాయుగుండాల వరకే పరిమితమై సర్దుక పోతుండడంతో తుఫాన్ బాధ లేదు. ఫలితం మాత్రం బాగుంది. ముసురు పట్టి ఏకధారగా కాకుండా పగలంతా తెరిపిచ్చి రాత్రుళ్లు విరతలు విరతలుగా కురుస్తుండడంతో ఎవరికి ఇబ్బంది కల్గడం లేదు. పని చెరుపు లేదు. జిల్లా అంతటా చెరువులు నిండుతున్నాయి. పడమటి పల్లెల్లో కుంభవృష్టి వల్ల సోమశిలకు పుష్కలంగా నీరు వచ్చింది. 20 టిఎంసిల వరకు నిల్వచేశారు. ఈ రోజు దిగువకు వదలి పెట్టున్నారు. పెన్నా ఆనకట్ట పైన పారుతున్నాయి. అన్ని కాలువలూ నీటితో కళకళ లాడుతున్నాయి. చిత్రకార్తె చిత చిత ఇట్లనే మరి మూడు నాలుగు రోజులు వుంటే కరువు తీరి పోతుంది.

సమాజం ఎంత కృత్రిమంగా, యాంత్రికంగా మారిపోతున్నదో దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. స్వంతం తప్ప, స్వార్థం తప్ప ప్రక్క వాని కష్టాలు, కన్నీళ్ల పట్ల కనీస మానవతా ప్రతి స్పందనే అదృశ్యమై పోతున్నది. ఇటువంటి సమాజంలో ఇక దేశ భక్తి, జాతీయతా భావాలు ఎక్కడ వెదికితే కన్పిస్తాయి?

#### రాజేశ్వరమ్మకు రంగ రంగ వైభవం

రాజరాజేశ్వరి దేవాలయం తిరునాళ్లు రంగ రంగ వైభవంగా ప్రారంభమైంది. చూసే వారికి రెండు కళ్లు చాలడం లేదంటే నమ్మండి! అదేమి విద్యుత్ అలంకరణ? అవేమి కరెంట్ దీపాల తోరణాలు? దేవస్థానం అధ్యక్షుడు కె.వి. రాఘవ రెడ్డి టౌన్ ప్రజలను సమ్మోహితులను చేసేస్తున్నారు. రోడ్లో పోయే వారు అట్లే నిలబడి పోతున్నారు. రాజేశ్వరమ్మ అదృష్టం కొద్దీ రాఘవ రెడ్డి దొరికాడను కోవాలి!

#### జనార్దన రెడ్డి

మాజీ ముఖ్యమంత్రి శ్రీ



తమ సంస్థ తరఫున మహారాష్ట్ర తుఫాన్ బాధితులకు 25 వేల విరాళం చెక్కును కలెక్టర్‌కు అందజేస్తున్న రత్నం కాలేజి అధ్యాపకులు

నేదురుమల్లి జనార్దన రెడ్డి రెండు రోజుల నియోజక వర్గ పర్యటన తరువాత 12 తేది ఉదయం మద్రాసు మీదుగా వాయు మార్గాన హైదరాబాదు వెళ్లి పోయారు.

#### భూకంప విరాళాలు

మహారాష్ట్ర భూకంప బాధితులకు నారాయణ కోచింగ్ సెంటర్ అధినేత శ్రీ నారాయణ 25 వేల విరాళం సమర్పించాడు. తమ తోటి సంస్థ రత్నం కాలేజి నిర్వాహకుడు శ్రీ కె. రత్నం ఎవరూ అడగకుండా లక్ష రూపాయలు ఇవ్వడంతో నారాయణకూ బాధ్యత తెలిసి వచ్చింది. రత్నం కాలేజి విద్యార్థులు, అధ్యాపకులు కలిసి మరో 25 వేలు జమ చేసి ఇచ్చారు. వారికి స్ఫూర్తి రత్నం గారే!

ఇంతకు మించి నెల్లూరు నుంచి చెప్పుకో దగిన రీతిలో విరాళాలు పోగు పడలేదు. కోట్లకు పడగ లెత్తిన కుబేరులు అసంఖ్యాకంగా వున్నా వారెవరిలో సోదర మానవ విషాధ గాథలు స్పందనను కల్గించక పోవడం విచారకరం. ధాను దాను

#### బ్రాందీ ఉద్యమం

సారాయి ఉద్యమం తర్వాత ఇప్పుడిప్పుడే జిల్లాలో బ్రాందీ వ్యతిరేక ఉద్యమం పురుడు పోసుకుంటున్నది. కలిగిరిలో మహిళలు బ్రాందీ అంగళ్ల ముందు సత్యాగ్రహం చేసి మూయించేశారు. అయితే కొంత విరామం తర్వాత తిరిగి వాటి తలుపులు తెరుచుకున్నాయి.

సారా పూర్తిగా అదృశ్యం కావడంతో త్రాగుబోతులు విస్కీ బ్రాందీల పైనే ఆధార పడుతున్నారు. పల్లెటూళ్లలో సైతం ఆ అంగళ్లు వేలల్లో వ్యాపారం చేస్తున్నాయి. అయితే ప్రభుత్వం లైసెన్సు ఫీజులు, పన్నులు పెంచి వేయడం వల్ల వాటి ధరలు ఆకాశానికి ఎదిగి పోయాయి. సారాయి వున్న రోజుల్లో త్రాగుడుకు పది రూపాయలు ఖర్చు పెట్టే వారు. ఇప్పుడు రంగు కలిపిన సారా సీసాల రూపంలో ముప్పయ్ రూపాయలు చెల్లించ వలసి వస్తుంది. బ్రాందీ ఉద్యమం కూడా ఫూపందుకొని.

తరువ 6 పేజీలో

## ఎమ్మెల్యేలు ఎవరికి వారే యమునా తీరే కావడంతో

# జిల్లా కాంగ్రెస్‌కు నాథుడే లేకుండా పోయాడు!

యానాది రెడ్డి గారి, మంత్రిత్వంతో జిల్లా రాజకీయం ఎట్లెట్లో మారి పోతుందను కొన్నాం కాని, అది వున్నది వున్న చోటనే వుండి పోయింది. అంగుళం ముందుకు జరగలేదు; అణు మాత్రం మారలేదు.

యానాది రెడ్డి గారి మంత్రిత్వానికి ఎందువల్లనో యాంటీ జనార్దన రెడ్డి రంగు పులమ బడింది. ముఖ్యమంత్రి ఉద్దేశించి కాదు, యానాది రెడ్డి గారు కోరీ కాదు - దానంతట అదే ఆ ప్రచారం జరిగి పోయింది. అప్పటికీ ఆయన జనార్దన రెడ్డిని కలిసి ఇవన్నీ వట్టి కబుర్లేను స్వామీ, నేను నీతోటే వుంటాను, నీ నీడగా మసలుతాను అని బాసలు చేసి వచ్చాడట. మామూలు జనమే కాదు - ఎమ్మెల్యేల వంటి నాయకులూ అదే దృష్టితో ఆలోచించారు. సన్మాన సభల్లో ఆ గ్రూపుల తారతమ్యం కన్పడింది కూడా. మాగుంట సుబ్బరామ రెడ్డి, జెకె రెడ్డి, యానాది రెడ్డిల కలయికతో ఒక కొత్త శక్తి ఆవిర్భ విస్తుందనే అన్పించింది. కానీ నెల్లూరులో ఆనం సంజీవ రెడ్డితో, హైదరాబాదులో మాగుంట సుబ్బరామ రెడ్డితో చాతుర్యంగా రాజకీయ కాపురం చేస్తూ కృష్ణ పరమాత్మ అంశను స్ఫురింప జేస్తున్న జనార్దన రెడ్డి గారు వారిదా అవకాశం ఇవ్వలేదు. ఎంత కష్టం మనసులో వున్నా మాగుంట వర్గీయులు జనార్దన రెడ్డిని వదలుకోరని రుజువైంది. ఈ పరిస్థితిని గమనించే యానాది రెడ్డి గారు సర్దుక పోయినట్లున్నారు.

పదకొండు సీట్ల భారం తన పైన వుందన్న స్లోగన్‌ను కూడా విడిచి పెట్టేశారు కొత్త మంత్రి వర్యులు. ముఖ్యమంత్రి పై నెపం పెట్టి అన్ని నియోజక వర్గాలలో పర్యటనల ద్వారా పెత్తనం స్వీకరించాలని చూశారు కాని - అది ఫలించ లేదు. అల్లూరు విష్ణ తప్ప ఆయన్ను తమ బంగారు పుట్టల్లో వేలు పెట్ట నిచ్చేవారు ఎవ్వరూ లేరు. నిన్న మొన్నటి వరకు ఆయన చేసింది అదే కదా! కావలికి ఎవ్వరి రానిచ్చారు?

ఇంకొక ప్రక్క ఇళ్ల మంత్రి శ్రీ పసల పెంచలయ్య యానాది బావ పవర్ తగ్గించడానికి చూస్తున్నారు. పెంచలయ్యకు వెయ్యేనుగుల బలం జనార్దన రెడ్డి రూపంలో వుండనే వుంది మరి! ఈ మధ్యే శేషారెడ్డి పెంచలయ్యను తన నియోజక వర్గంలో త్రిప్పి, రెండో మంత్రిని పట్టించుకునే వారు లేరన్న దుష్ప్రచారానికి సమాధానం చెప్పాడు. ప్రక్కనుండే ఎమ్మెల్యేల సంఖ్యతో చూస్తే యానాది రెడ్డి కంటే పెంచలయ్యే బెటరు. సివి, పట్రా లిద్దరూ ఆయనకు చెరొక ప్రక్క నిలబడు తున్నారు. యానాది రెడ్డి గారికి కుడి, ఎడమ కూడ విష్ణ వర్ధనుడే! జెకె ఎవ్వరికీ దొరికే వాడు కాదు. వెంకట రత్నం నాయుడు గారికి ఆరోగ్యం బాగాలేదు. సుందర రామరెడ్డి గారు తానిద్దరికీ కావలసిన వాడినే నన్నట్లుంటారు. జానకి రాం ఇప్పుడు జిల్లా రాజకీయాలు పట్టించుకునే పరిస్థితిలో లేరు. ఆయన లోకం ఆయనది. స్వభావ రీత్యా విష్ణుకు



జానకి రాంకు సరిపడదు. విష్ణ ప్రక్కనున్నప్పుడు ఎంత యానాది "బావ" అయితే మాత్రం జానకి రాం ఎందుకు దగ్గరకు వస్తాడు?

ఎమ్మెల్యేలందరూ ఇట్లా ఎవరికీ వారే యమునా తీరే నన్నట్లు ప్రవర్తించడం కాంగ్రెస్ అభిమానులను, కార్యకర్తలను బాధిస్తున్నది. ఒకటిన్నర సంవత్సరంలో ఎన్నికలు పెట్టుకొని పార్టీని గాలికి వదిలేసి తిరగడం ఎవరికైనా బాధాకరమే కదా? అందులోనూ ఇది వరకటి వలె మండలా ధ్యక్షులు, మునిసిపల్ ఛైర్మన్లు లేరు. ప్రజలకు పార్టీకి మధ్య బాంధవ్యం నెరప వలసింది ఎమ్మెల్యేలే. వారే ఉదాసీనంగా వ్యవహరిస్తే, ఇంక పట్టించుకునే దెవరు? ఇది వరకు జనార్దన రెడ్డి గారు జిల్లా అంతటినీ దృష్టిలో వుంచుకొని, పర్యటనలు చేసి, నాయకులను కలిసి, కార్యకర్తలను కూడ కలిపి చైతన్య వంత వాతావరణం సృష్టించే వారు. ఈ ఎమ్మెల్యేల అలుకలు, నిట్టూర్పులు, శాపనార్థాలతో వేగలేక ఆయన కూడా నా చిన్ని నియోజక వర్గానికి శ్రీ రామరక్ష అనుకుంటూ వెంకట గిరికి మాత్రం పరిమితమై పోయారు. గ్రామ గ్రామం తిరిగి, మనిషి మనిషిని పలుకరించి తన పరిస్థితిని మెరుగు పరుచు కుంటున్నారు. మాజీ ముఖ్యమంత్రి హోదాలో ఆయన వెంకటగిరి, వాసులడిగే కోరికలు తీర్చగల్గు తున్నారు. ఎమ్మెల్యేలకా అవకాశం లేదు. ఇద్దరు మంత్రులున్నా జిల్లాకు తెచ్చిన, తెస్తున్న అభివృద్ధి పథకాలు, నిధులు సున్న. ప్రజలడిగే పనులు చేయలేక, చేయించే స్తోమత లేక అసలు ప్రజల దగ్గరకే పోకుండా తప్పించుక తిరుగుతున్నారు ఎమ్మెల్యేలు.

డిసిసి అధ్యక్షుడికి మాగుంట వివాదంతో తలబొప్పి కట్టింది. ఏదీ పట్టించు కోవడం మానివేశారు. మాగుంట సుబ్బరామ రెడ్డి గారికి కోవూరు అపజయంతో ఎక్కడ లేని నిరుత్సాహం ఆవహించింది. అయినా ఏ పని పట్లా శ్రద్ధ చూపడం లేదు.

వెరసి కాంగ్రెస్ పార్టీకి ఈ రోజు జిల్లాలో నాథుడు లేకుండా పోయాడు. కార్యకర్తలు ఎవరిని కదిలించినా ఉత్సాహం లేదు. అంతా నిర్లిప్తత. ఎక్కడా సందడి లేదు. ఈ పరిస్థితి ఇట్లనే కొనసాగితే ఎన్నికల నాటికి కాంగ్రెస్ గతి ఏమౌతుందో వూహ కందడం లేదు. అదృష్టమే మిటంటే - కాంగ్రెస్ ఇసుక తక్కెడ మాదిరి వుంటే తెలుగుదేశం పేడ తక్కెడను తలపింప జేయడం.

## సారాయి

(2 పేజీ తరువ)

ప్రభుత్వాలతో మాట్లాడి ఈ సారా ప్రవాహాన్ని నిరోధించడానికి ఒక ప్రతినిధి బృందం హైదరాబాదు నుంచి వెళ్లింది. కానీ విజ్ఞప్తులతో అగే సమస్య కాదిది.

పెను ఉప్పెన వంటి ఈ నాటు సారా వరదను తట్టు కోవడానికి ఎక్సైజ్ శాఖ దగ్గర యంత్రాంగం లేదు. వారి దగ్గర సిబ్బంది చాలా తక్కువ మంది వున్నారు; తగినన్ని వాహనాలూ లేవు. సారా నిషేధ కార్యక్రమం పర్యవేక్షించడానికి ప్రత్యేకంగా ఒక ఐపిఎస్ అధికారిని నియమిస్తామని, 1200 మంది పోలీసులను ఎక్సైజ్ శాఖకు బదలీ చేస్తామని ప్రభుత్వం చెప్పిన మాటలు ఇంకా ఆచరణకు రాలేదు.

అక్టోబరు 1 తేదికి ముందు ప్రభుత్వం తన దగ్గరున్న సారా నిల్వల్ని పెద్ద ఎత్తున మార్కెట్‌లోకి విడుదల చేసింది. ఆ రోజుకు కాంట్రాక్టర్ల దగ్గర కోటి 50 లక్షల లీటర్ల సారా మిగిలి వున్నట్లు అంచనా. ఈ నిల్వలు మరొక మూడు నెలల వరకు 'మస్తు'గా సరిపోతాయని చెప్తున్నారు. అక్టోబరు 1 తేదిన సారా అంగళ్లన్నింటికీ తాళం వేసిన ఫ్రుటిక అధికారులు కాంట్రాక్టర్ల గోడౌన్ల జోలికి వెళ్లలేదు. వారు కలదలుసు కునే సరికి అవన్నీ రహస్య ప్రదేశాలకు తరలి పోయాయి. ఇంతకు ముందు సారా అంగళ్లలో మాత్రం కన్పించే పొట్లాలు ఇప్పుడు కిల్లీ బంకుల్లో, కిరాణా షాపుల్లో కూడా దర్శన మిస్తున్నాయి.

ఈ పరిస్థితులలో సారా నిషేధం ఏ రూపు తీసుకుంటుందో, ఏ మలుపు తిరుగుతుందో నన్న భయం అధికార వర్గాలలో కన్పిస్తున్నది. నాటు సారా, గుడుంబాల వంటివి అపలేక పోతే కల్తీ సారా చావుల ప్రమాదం పొంచి వుంటుంది. కోట్ల రూపాయల ఆదాయం కోల్పోయి, దొంగ సారా వ్యాపారులను సంపన్నులను చేసి, ప్రజల ఆరోగ్యానికే ప్రమాదం కల్పించి నట్లవు తుందేమోనని సందేహ పడుతున్నారు. ప్రభుత్వం పెద్ద ఎత్తున ఎక్సైజ్ శాఖను క్షాళనం చేసి, సిబ్బందిని, వాహనాలను, ఆయుధాలను సమకూర్చి దొంగ సారా వ్యాపారుల పై యుద్ధం ప్రకటిస్తే తప్ప నిషేధ చట్టం ఫలించదు.

## నెల్లూరు సబ్‌కోర్టులో

EP.No 52 of 1992
O.SNo. 79 of 1986

కారం శెట్టి వీరరాఘవయ్య
- DHR/వాది

VS

శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ట్రేడర్సు Represented by its parteners
1.K. రామచంద్రయ్య
2.బచ్చు వెంకటసుబ్రమణ్యం
- JDRs ప్రతివాదులు

ఈ నంబరు డిక్రీ బాకీకిగాను యీ క్రింది షెడ్యూలు దాఖలా స్థిరాస్తి పై కోర్టు వారి వలన 4.11.1993 తేదిన బహిరంగముగా వేలం వేయబడును.

**SCHEDULE**

Nellore Registration District - Nellore Sub. Registration - Nellore Town - Stonehousepet - Sri Ranga rajapuram, Ward No.5, Door No. 469. House property situated with in the following boundaries:

East: House of Thiruveedhi Rathnam; South: Public Street; West: House of Sola Balasubrahmanyam; North: Irrigation Channel.

Within these boundaries, site of about 30 ankanams with a terraced building, down stairs of about 15 ankanams and upstairs of about 9 ankanams.

D.H.r's Value Rs. 50,000/-
Amin's Value Rs. 80,000/-
J.D.R's value Rs. 26,00,000/-

బి. శ్రీహరి
DHr అడ్వొకేటు

## జిల్లావార్తలు

(2 పేజీ తరువ)

అడుగుల లోతున గుంటలు త్రవ్వి కేబుల్స్ మార్చింది టెలిఫోన్ శాఖ. అంత వరకు ఫర్వాలేదు. పని కాగానే గుంటలు అట్లనే వదిలేసి వెళ్లి పోవడంతో టౌన్‌లో జనం కాళ్లు చేతులు విరగ్గొట్టు కుంటున్నారు. వానలకు ఈ గుంటల నిండా నీళ్లు నిల్చాయి. రోడ్డు ప్రక్కనే వుండడం వల్ల ఏది టెలిఫోన్ గుంటో, ఏది రోడ్డు గుంటో తెలియక, ప్రక్కకు అడుగు వేస్తే బుడుంగున మునిగి పోతున్నారు. ఎలిమెంటరీ స్కూలు దగ్గర కొందరు పిల్లలు వీటిలో పడి కాళ్లు చేతులు విరగ్గొట్టు కున్నారు. ఒక లారీ చక్రం వాటిలో పడి, లారీయే బోల్తా పడే ప్రమాదం ఏర్పడింది.

వెంటనే వీటిని పూడ్చకుంటే పుత్తూరు వైద్యులకు గిరాకీ పెరిగి పోతుందండీ - డిఇటి గారూ!

## గూడూరు రోటరీలో సీనియర్ సిటిజన్స్ క్లినిక్

గూడూరు రోటరీ క్లబ్ 1 తేది నుంచి సీనియర్ సిటిజన్స్ క్లినిక్ ప్రారంభించింది. ప్రతి ఆదివారం అనిల్ కుమార్ స్మారక పాఠశాల భవనంలో టౌన్‌లోని వృద్ధులకు ఉచితంగా వైద్య పరీక్షలు నిర్వహిస్తారు. అప్పుడప్పుడు నిపుణుల సలహాలు ఇప్పించేందుకూ ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ క్లినిక్‌కు శ్రీ అల్లూరు ఆదిశేష రెడ్డి అధ్యక్షుడుగా, డాక్టర్ సిఆర్ రెడ్డి కార్యదర్శిగా ఎన్నికైనారు.

పేద వృద్ధులకు వైద్య సహాయం చేయాలనే మంచి ఆలోచన కల్గిన గూడూరు రోటరీయులు అభినందనీయులు.

## సణుగుడు

(2 పేజీ తరువ)

కొట్టినట్లు మనసులో వున్న మాట చెప్పేవారు. అందుకు వేదికకూడా జయప్రకాశ్ నారాయణ్ జయంతి సభ కావడం విశేషం. సోషలిజం కోసం సర్వోదయం కోసం బ్రతుకంతా పరితపించిన ఆ మహా మనిషి జయంతి, కృష్ణకాంత్‌లో ఏదో తెలియని స్ఫూర్తి రగిలించి వుండాలి! జయప్రకాష్ బ్రతికున్నప్పుడు ఇట్లానే మాట్లాడే వారు.

గవర్నర్‌గా వుండి ఇట్లా మాట్లాడ వచ్చా అన్న వివాదం వుండనే వుంది. గవర్నర్ అయినంత మాత్రాన స్పందించే మనసు, వ్యక్తిత్వం వుండ కూడదన్న నియమం లేదు కదా! కృష్ణ కాంత్ అన్న మాటలో తప్పేముంది? ఏ నాయకుడి చరిత్ర చూసినా ఏమి కన్పిస్తుంది? పోలీస్ స్టేషన్లలో రౌడీ షీటర్లుగా ఫోటోలు తగిలించి వుంచిన వారు ఎమ్మెల్యేలు, మంత్రులు అవుతూనే వున్నారు కదా! మంత్రులుగా వుండే బ్యాలెట్ పెట్టెలు ఎత్తుకొని పోయే వారిని, బాంబులు విసిరే వారిని చూస్తూనే వున్నాం కదా? శాసన సభ, పార్లమెంట్ సీట్ల టిక్కెట్లకు పార్టీలు దేనిని అర్హతగా భావిస్తున్నాయి? డబ్బు, రిగ్గింగ్,

## పురిటి చీకట్లో

పుడమి
తల్లికి
గర్భస్రావం
అయింది!
ఉదరం
మృత్యుకుహరంగా
మారింది!!

- కెఎస్వీ రాజన్

సామర్థ్యాలే కదా? అభ్యర్థులకు డబ్బు ఎక్కడి నుంచి వస్తున్నది? రౌడీయిజం చేయకుండా రిగ్గింగ్ జరపడం ఎట్లా సాధ్యం? పదవుల్లోకి వచ్చేటప్పుడు నాయకుల ఆస్తి పాస్తులెంత? పదవిలో వుండగా ఏడాది కేడాదికి పెరుగుతున్న ఆస్తుల విలువ ఎంత? ఎమ్మెల్యే అయితే లక్షల ఆరన; మంత్రిత్వం వస్తే కోటికి నిచ్చెన; ముఖ్యమంత్రి అయితే పదుల కోట్లకు తపన.

పది పదిహేనేళ్లివతల ఎందరు మంత్రుల్ని, ఎందరు ముఖ్యమంత్రుల్ని చూడలేదు?

పోలీసు శాఖ నేర మయ మైందన్న మాట కూడా అక్షర సత్యం. కానిస్టేబిల్ నుంచి కమిషనర్ వరకు, ఎస్‌పి నుంచి డిజిపి వరకు ఒక్క పోలీసు అయినా స్వతంత్రంగా వ్యవహరిస్తున్నాడా? రాజకీయం, పోలీసు శాఖ మమేకం చెంది పోవడంతో పోలీసులు నిర్వీర్యులై పోతున్నారు. దొంగలు, నేరస్తులు, హంతకులు, గూండాలతో సంబంధాలు కల్గిన పోలీసు లెందరు లేరు? స్వయంగా నేరాలు చేసి, చేయించే పోలీసులూ మనకు కొత్త కాదు. వ్యభిచార గృహాలు నడిపించిన సబిన్స్‌పెక్టర్లు, దొంగలను కూడదీసి చోరీలు చేయించిన సర్కిలిన్స్‌పెక్టర్లు, తమ నాయకుల ప్రీత్యర్థం వారి ప్రత్యర్థులను వేధించే డిఎస్‌పిలు, ఎస్‌పిలను ఎందర్ని చూడడం లేదు?

గవర్నర్ చెప్పిందంతా నిజమే. కాని కేవలం చెప్పుకోవడం వరకే ఈ దుర్మార్గాలు పరిమితం కావాలా? కాకా హోటల్లో వన్ బై టు కాఫీ త్రాగుతూ సగటు పౌరుడూ మాటలకే సరిపెట్టి, గవర్నర్ హోదాలో వుండే వ్యక్తి మాటలతోనే సరి పుచ్చితే ఈ రోగం కుదిరే దెట్లా? కుదిరేదెప్పుడు? వేదికెక్కి విప్లవాత్మక ఉపన్యాసాలు దంచితే వినడానికి కమ్మగా వుంటుంది. గవర్నరు గారు ఆవేశంగా మాట్లాడుతుంటే వింటుండిన జనం చప్పట్లు కూడా తట్టి వుంటారు. కాని కుళ్లి పోతున్న సామాజిక వృక్ష వేరు భాగాన్ని మాటలు, చప్పట్లు బాగు చేయగలవా? దానికి మందేదో కనిపెట్టి, వైద్యం చేయకుండా వట్టి మాటలు మాట్లాడితే గవర్నర్ అయినా, మరొకరైనా ప్రజలకు మేలు చేస్తున్నట్లు లెక్కలోకి రారు; మధ్య పెట్టి తమ ఇమేజ్ పెంచుకునే కుత్సితానికి పాల్పడినట్లే భావించాలి.

గవర్నర్ గారు ఇదే సభలో నక్సలైట్లను సామాజిక సేవకులుగా అభివర్ణించారు. ఆయన చెప్పే నక్సలైట్లు చరిత్ర పుస్తకాలలో తప్ప కన్పించడం లేదిప్పుడు. సమాజ శ్రేయస్సు, సిద్ధాంతం, చిత్తశుద్ధి వంటి వేవీ లేకుండా కేవలం హింసతో ఆర్గనైజెడ్ గూండాలుగా వ్యవహరించే కిరాతకులే ఇప్పుడుండేది. నక్సల్ బరి లక్ష్యం, ఆశయం గొప్పవే - కాని ఆచరణలో ఆ రెండింటికీ స్థానం లేనప్పుడు నక్సలైట్లను ప్రశంసించడ మంటే గవర్నర్ గారి అవగాహనా శక్తి పైనే అప నమ్మకం కలుగుతున్నది.




విఆర్ కాలేజిలో ఇటీవల రిటైరైన పది మంది లెక్చరర్లకు సామూహిక సన్మానం చేశారు. ఆ సభలో లెక్చరర్ పోలయ్య, ప్రిన్సిపల్ గోపాల కృష్ణమూర్తి, కమిటీ అధ్యక్షుడు తూపిలి సుందర రామ రెడ్డి

## నెల్లూరు ముచ్చట్లు

(5 పేజీ తరువ)

సంపూర్ణ మద్య నిషేధం అమలైతే తప్ప పేదవాడికి ప్రయోజనం లేదు.

## మునిసిపల్ సమ్మె

రాష్ట్ర వ్యాప్త మునిసిపల్ ఉద్యోగుల సమ్మెలో భాగంగా నెల్లూరులోనూ కొందరు ఉద్యోగులు సమ్మె చేస్తున్నారు. శానిటరీ, ఎలక్ట్రిసిటీ, నీటి విభాగాలు సమ్మెలో చేరలేదు. కాబట్టి, దాని ప్రభావం కన్పించడం లేదు.

## మాగుంట ట్యాంకర్

ఉచిత ట్యాంకర్ల ద్వారా నెల్లూరు, ఒంగోలు ప్రజల దాహం తీరుస్తున్న ఎమ్పీ శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి గూడూరు టౌన్‌కు ఒక ట్యాంకర్ బహూకరించారు. రోటరీ క్లబ్ అభ్యర్థన మేరకు ఈ వదాన్యత ప్రదర్శించారాయన.

## ధనలక్ష్మి ఆయిల్ మిల్స్

ముత్తుకూరు రోడ్డులోని వావిలేటి పాడులో శ్రీ ధనలక్ష్మి అగ్రో - ఆయిల్స్ ప్రైవేట్ లిమిటెడ్ పరిశ్రమ 10 తేది ప్రారంభమైంది. రోజుకు 150 టన్నుల తవుడు నూనె తీసే ఫ్యాక్టరీ ఇది. దాదాపు 3 కోట్ల భారీ వ్యయంతో నెలకొల్పారు. నెల్లూరులో తవుడు నుంచి నూనె తీసే రెండవ ఫ్యాక్టరీ ఇది. పెనుబర్తికి చెందిన శ్రీ పిడూరు వెంకట సుబ్బారెడ్డి, రాజగోపాల రెడ్డి, పరంధామ రెడ్డి దీనికి యజమానులు, అందరూ రైతు కుటుంబీకులే. రైతులుగా వుండి ఇంత పెద్ద పరిశ్రమ స్థాపించడం అభినందనీయం. ఎపిఐడిసి, ఎపిఎస్ఎఫ్‌సి, బ్యాంక్ ఆఫ్ బరోడాల నుంచి ఆర్థిక సహాయం తీసుకున్నారు.

పరిశ్రమ మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లాలని ఆకాంక్షిస్తున్నాము.

## విలేఖర్లూ పొరపాటు చేయవద్దు!

కొందరు దినపత్రికా విలేఖర్లు ప్రభుత్వ కార్యాలయాలకు వెళ్లి అధికార్లను బెదరించి డబ్బు గుంజు తున్నారన్న ఆరోపణ విన్పడుతూంది. వాణిజ్య పన్నుల శాఖ అధికారి ఒకరి నుంచి ఈ ప్రకారం ఐదు వేలు దండారని వార్త.

ఇదే నిజమైతే చాలా పొరబాటు చేస్తున్నారు; సరిదిద్దుకోండి; లేకుంటే భ్రష్టు పట్టి పోతారు.

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 16.6 అ |
| నెల్లూరు చెరువు | 12.8 అ |
| సర్వేపల్లి రిజర్వాయరు | 4.3 అ |

### నెల్లూరు బజారు

మొలగొలుకులు

| | |
|---|---|
| 9672 (కొత్తవి) | 3,300/- |
| 9674 (కొత్తవి) | 3,800/- |

# హంస కాదు-హింస!

"అప్సారా" అనే పేరు నాకేమిటో అదోలా వుంది. అందుకే 'హంస' గా మార్చు కోవాలను కుంటున్నాను. మా ఆయన తన్వీర్ అహ్మద్ నా కంటే పొట్టి, నలుపు; కానీ ఆయన మందహాసంలో ఏదో వశీకరణ శక్తి వుంది. అన్నిటికన్నా ఆయన హృదయం అమృతం వంటిది. లేకపోతే ఆయన్ని ప్రేమించి పెళ్లి చేసుకోవడానికి నాకేమైనా పిచ్చా? అంటూ ఇటీవల హంస (ఐశ్వర్య) గురించి ప్రతి పత్రికలోనూ ఏదో ఒక ప్రకటన ఇస్తూనే వుంది. కాని, ఈమె ఇటీవలే నెల తప్పిందనే వార్త ఆమెతో చిత్రాలు తీసే నిర్మాతల గుండెల్లో రైళ్లు పరు గెత్తించింది. ఈమె పేరును హంస కన్నా హింసగా మార్చుకుంటే బాగుం టుందని ఓ నిర్మాత జోక్ చేశాడు!

# నగ్మా పెళ్లి!

రాజ్‌కపూర్ చిత్రం "రామ్ తేరీ గంగా మైలీ" చిత్రం హీరో రాజీవ్ కపూర్‌ను రెండు మూడేళ్లలో వివాహ మాడ బోతున్నట్లు అంజనా ప్రొడక్షన్స్ చిత్రంలో ఐ.పి.ఎస్. అధికారిణిగా నటిస్తున్న నగ్మా తెలిపింది. "పెద్దింటల్లుడు" చిత్రంతో తెలుగు సినిమా రంగంలో ప్రవేశించిన ఈమె ఇంత వరకు తొమ్మిది తెలుగు చిత్రాల ద్వారా యువకుల హృదయాలను ఆకట్టుకుంది. వివాహ మయ్యాక నటిగా విరమించు కుంటానని తారలందరికీ మల్లే ఈమె కూడా చెబుతోంది.



పోలీస్ లాకప్ చిత్రంలో విజయశాంతి

# దసరా పండుగకు సినిమాల దండు!

ఇదివరకు తయారయ్యే చక్కని చిత్రాలు చాలా బాగా ఆడేవి. అందుకే సంక్రాంతి, ఉగాది, దసరా, దీపావళి పండుగల సందర్భంగా కొత్త చిత్రాలు విడుదల చేసేవారు. అక్టోబర్ 24 న విజయదశమికి ముందూ వెనుకా చాలా చిత్రాలు విడుదలయ్యేట్లున్నాయి. అక్టోబర్ 13న చాలా కాలం తర్వాత జయప్రద నటించిన "రౌడీ టీచర్" 14 తేదీన అర్జున్ డబ్బింగ్ చిత్రం 'జెంటిల్‌మెన్" 16న ప్రశాంత్-దివ్యభారతి పాల్గొన్న 'తొలిముద్దు' విడుదలకు నిర్ణయించబడ్డాయి. అక్టోబర్ 21న మూడు చిత్రాలు, 22న నాలుగు చిత్రాలు విడుదల చేయడానికి నిర్మాతలు హడావిడి పడుతున్నారు. అక్టోబర్ 21న ఎన్.టి.ఆర్. 'శ్రీనాథ కవిసార్వభౌమ', కృష్ణ 'కిరాయిగూండా', విజయశాంతి-కోడి 'పోలీస్‌లాకప్' విడుదల కానున్నాయి. అక్టోబర్ 22న మోహన్‌బాబు 'రౌడీమొగుడు', క్రాంతికుమార్ "సరిగమలు", కె.ఎస్.రామారావు 'మాతృదేవోభవ', భానుచందర్ 'రౌడీరాజకీయం', చిత్రాలను విడుదల చేయాలని నిర్మాతలు సన్నాహాలు చేస్తున్నారు. ఎందుకీ పరుగులో ఎవరికీ అర్థం కావడంలేదు. ఈ మధ్య కొన్ని వారాలలో ఏ కొత్త చిత్రమూ విడుదలవక అప్పుడప్పుడు కొంత గాప్ వస్తూ వచ్చింది. ఇప్పుడు ఒకే నెలలో ఇన్ని చిత్రాలు దాడి చేస్తుంటే, ప్రేక్షకులకు అన్ని చిత్రాలనూ చూసే ఓపిక ఉంటుందా? ఇది ఆరోగ్యకరమైన పోటీ కాదన్న విషయం ఎవరికీ తెలియనిది కాదు.

## ఇంటూరి దర్శకత్వంలో 'తరికుండ వేంకమాంబ'

తెలుగులో తొలి సినిమా పత్రిక 'చిత్రకళ' వెలువరించిన ఘనత కళాప్రపూర్ణ ఇంటూరి వెంకటేశ్వర రావుకు దక్కుతుంది. ఈయన స్వర్గీయ గోపిచంద్, స్వర్గీయ కడారు నాగభూషణం, కీ.శే. గూడవల్లి రామబ్రహ్మం వంటి దిగ్దర్శకుల వద్ద అసోసియేట్‌గా పని చేశాడు. ఆయన రచించిన కథానాయిక మొల్ల సినిమాగా విడుదలై ఎన్నో అవార్డులు పొంది. ఇప్పుడు ఆయనే రచించిన తరికుండ వేంకమాంబ అనే మరొక నవలను తెరకెక్కించడానికి ప్రయత్నాలు జరుగు తున్నాయి. హాస్యనటుడు పద్మనాభం కుమార్తె వసంత లక్ష్మి ఇందులో ప్రధాన పాత్ర ధరిస్తుంది. రవిచంద్ర అనే స్ఫురద్రూపి కథనాయకుడిగా పరిచయం గావింప బడతాడు. మాటలు: అప్పలాచార్య. సంగీతం: ఘంటసాల విజయ కుమార్. ఈ భక్తి రస ప్రధాన చిత్రానికి ఇంటూరి - పద్మనాభం కలిసి సంయుక్తంగా దర్శకత్వం నెరపుతారు. చిత్తూరు దగ్గరున్న తరికుంత గ్రామంలోనే ఎక్కువ భాగం చిత్రీకరింప బడుతుంది.

# పేర్లు కూడా తోచడం లేదు!

అంకెలు టైటిల్స్‌గా కొన్ని చిత్రాలు తయారవు తున్నాయి. పెట్టడానికి పేర్లు కూడా తోచని భావ దారిద్ర్యంలో పడి పోయింది తెలుగు చిత్రసీమ; అది ఎవరి ఖర్మ?

"నెంబర్ వన్" -సీనియర్ నటులు రాజనాల, నాగభూషణం మా చిత్రంలో అతిథి పాత్రల్లో కనిపిస్తారు. మా హీరో కృష్ణ అభిమానులు ఉత్సాహ పడుతారనే "నెంబర్ వన్" అనే పేరు పెట్టాం" అన్నారు ఎ. వెంకటేశ్వ రావు. ఈయన నిర్మించే ఈ చిత్రంలో సౌందర్య, కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, బాబూ మోహన్, మహర్షి రాఘవ, రాజా రవీంద్ర, ఆలీ, ఐరన్ లెగ్ శాస్త్రి ఇతర పాత్రధారులు. మాటలు: దివాకర్ బాబు, ఛాయ: ఎస్. సుధాకర్ రెడ్డి, దర్శకత్వం: ఎస్వీ కృష్ణారెడ్డి. ఫిబ్రవరి మొదటి వారంలో విడుదల.

"వన్ బై టూ" -కష్టమైనా, సుఖమైనా దేన్నయినా కలిసి పంచు కుందామనే అన్నదమ్ముల కథ. కోటీశ్వరుడైన తండ్రిని పోగొట్టుకున్న ఈ సోదరులు నానమ్మ, తాతయ్య దగ్గర పెరుగు తూంటారు. డబ్బు విలువ తెలియని ఆ ఇద్దరూ బాధ్యతా రహితంగా తిరుగు తూంటే, వాళ్లను తాతయ్య ఇంటి నుంచివెళ్లగొట్టాడు. బయట పడ్డ ఆ యువకులు చివరికి డబ్బు విలువను గుర్తిస్తారు – ఇదీ కథ అన్నారు శివనాగేశ్వర రావు. ఈయన దర్శకత్వంలో తమ్మారెడ్డి భరద్వాజ నిర్మిస్తున్న 'వన్ బై టూ' చిత్రంలో అన్నదమ్ములుగా చక్రవర్తి, శ్రీకాంత్ నటిస్తున్నారు. వీరి సరసన నాయికలుగా నిరోషా, నవనటి ఉత్తర, ఇతర పాత్రలలో బ్రహ్మానందం, తనికెళ్ల భరణి, బాబూ మోహన్, నగేష్, సుధాకర్, వేలు, కల్లు చిదంబరం, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, సూర్యకాంతం పాల్గొంటారు.

## ఇళయరాజాకు ఘన సన్మానం

లండన్‌లోని సుప్రసిద్ధ 'గ్రాండ్‌సింఫోని' నెంబర్-1'కోసం బాణీలు కూర్చిన సంగీత దర్శకుడు ఇళయరాజాకు భారతీయ చలన చిత్ర పరిశ్రమ తరపున అక్టోబర్ 8న మద్రాసులో భారీ ఎత్తున సన్మానం జరిగింది. శివాజీ గణేశన్ ముఖ్య అతిథి.

కొరవ 8 పేజీలో

# హీరో వచ్చి కటకటాల నుంచి విడిపిస్తాడా?

"వెర్రి అభిమానం వినాశనానికే" - అని ఇటీవల బెంగుళూరులోని కొందరు యువకులు గుర్తించారు. కాని, చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొని ప్రయోజనమేమిటి? బెంగుళూరు ఎం.యు.ఐ. పాలిటెక్నిక్ సమీపంలో ఒక వీడియో క్యాసెట్ల దుకాణం నడుపుతున్న చంద్రశేఖర్ అనే అతనికి ప్రసన్న అనే వ్యక్తి ఫోన్ చేసి, 'రాయరు బందరు మావన మనెగె' అనే విష్ణువర్ధన్ హీరోగా నటించిన కన్నడ చిత్రం కేసెట్ ఉందా అని అడిగాడు. మధ్యాహ్నం మూడున్నర గంటల ప్రాంతంలో వస్తే ఇస్తానన్నాడు చంద్రశేఖర్. అదే సమయానికి ప్రసన్న తనతో పాటు కారులో మరో ఏడెనిమిది మందిని తీసుకొచ్చి 'మా అభిమాన హీరో విష్ణువర్ధన్ నటించిన దొంగ కేసెట్ నీ కెక్కడిది?' అంటూ ఆ షాపు పై దాడిచేసి అయిదు లక్షలకు పైగా విలువ చేసే వీడియో కెమరాలు, కేసెట్లు ధ్వంసం చేశారు. వెంటనే పోలీసు రిపోర్టు ఇవ్వబడింది. ప్రసన్న పారిపోగా మిగతా వారిని పోలీసులు కస్టడీలోకి తీసుకున్నారు. విష్ణువర్ధన్ తనను రక్షిస్తాడని ప్రసన్న, ప్రసన్న తమను రక్షిస్తాడని అతని నేస్తాలు ఎంతగానో ఎదురు చూశారు గాని ప్రయోజనం లేక పోయింది. వీళ్లల్లో కొందరు కాలేజ్ స్టూడెంట్స్ కూడా ఉన్నారట. సినిమా క్యాసెట్లవల్ల నిర్మాతకు నష్టం; కాలేజి పిల్లకాయలకెందుకు దురద? అంతగా హీరోపై అభిమానం వుంటే, క్యాసెట్ల షాపుపై ఫిర్యాదు చేసి వుండవచ్చు; దాడిచేసే వీరావేశం దేనికి? ఇప్పుడేహీరో వచ్చి వీరిని కాపాడతాడు?

## అతిశయం

పేకేటి శివరాం మనుమడు ప్రశాంత్ నేడు తమిళంలో బిజీ హీరో. ఇతని తండ్రి త్యాగరాజన్ సంగీత దర్శకుడు. ఇటీవల ఈయన సొంత భవనం పక్కన ఖాళీగా వున్న ప్రదేశంలో ఒక పోలీస్ స్టేషన్ సెట్ వేయించారు. ఇందులో చాలా షూటింగ్‌లు జరుగుతున్నాయి. తన గురించి, తన కొడుకు గురించి

# శివారెడ్డి పద్యాలు

### సోనియా గాంధీ

ఎందుకమ్మ సోనియా! ఎక్కళ్ళ యీళ్ళేవ
కాదు నీళ్ల మారి కుమిలిరివు
పోయిన వారు తిరిగి పుట్టింది యీనాటి
పరకు లేదు. నీకు ప్రతిరి తెలుసు

ఇంతవరకు వాళ్ళ పుస్తిరు పారిష్ట
కాంయమును వారి కరువు కాల
రాజీవ గాంధి యింక రారు రానేరారు
అంతలోను యింక అవతరిరు!

### కన్నతల్లిదండ్రి

కన్నతల్లిదండ్రి కరతెరి బాప్పూగా
కట్టుకున్న భార్య కరిబె దివిక
ఉక్కకుండి నేను వినుండి చేసిరి
కొడుకు గుర్తించి కుక్కదింద?

పందుకోను బాకు పరువుండి దిందుండి
కప్పుకోను రెక్క చుప్పుబుండి .
కనక లేని లోకాల కారు, మూడంతమ్ముల
పెద్ద లేదు. వీర మీకు తెలుసు!

కలకోటరు వస్తె కళ్లద్దు కొంటారు
మడిమలొత్తుతారు మంత్రులొస్తె

కవిని కోత చెక్క కాపి టీ నీళ్లకు
తప్పు వొప్పు దిద్ది తరచరాదు!

### మంత్రి కలికి

ఎంతో కాలమైంది యే తమ్ము దర్శించి
కవిని నేను తమ్ము కలుసుకోని.
మంత్రి పదవి దేంది మర్యాద నీ సొత్తు
వీత విష్టలకును విలువమావు!

### భిక్షమెత్తి

ఎంచుమించు పాతికేలు పద్యాలు వ్రాశా
అచ్చేయించ కొన్ని భిక్షమెత్తి
శిథిలమాయె కొన్ని చిమ్మట్లు కొట్టాయి
కొన్ని కొన్ని. తృప్తి కొంత వరకు

### యేజిబారు

యిచ్చి పిచ్చి కవిని ఎవరో వ్రాస్తుంట
గొకుతుంటు పొద్దుపోక ఎవ్వొ
తప్పులుందనచ్చు తండోపతండాలు
హెల్తుస్పాయిలైంది, యేజీవారు!

ఏదోయేదొ వ్రాశ యీగలాలి జేయకండి
ఒక్కసారి చదివి వదిలెయండి.
యింతవరకు జాలు యిదెనాకు/పదివేలు
కట్టుమేరె బల్లి కవికి నాకు!

## నెల్లూరు సంగతులు

(4 పేజి తరువాయి)

సన్మానించారు.

స్కూలు హెడ్మిస్ట్రెస్ శ్రీమతి నిర్మల స్వాగతం చెప్పారు; శ్రీ జివి సుబ్బారెడ్డి వందనాలు చెల్లించారు.

### అవతార్ మెహర్ బాబా శత జయంతి

అవతార్ మెహర్ బాబా శతజయంతి ఉత్సవాలు 12తేది బోస్‌హాలు ఆవరణలో జరిగాయి. కావలిపాడుకు చెందిన మల్లిక్ బృందం మెహర్‌బాబా అధ్యాత్మిక సందేశాలు సంకీర్తన రూపంలో గానం చేసింది. శ్రీ చింతా సాయిబాబా మెహర్‌బాబా జీవిత చరిత్రను వివరిస్తూ ఉపన్యసించారు. శ్రీ చింతా సర్వారావు కూడా మాట్లాడారు మెహర్ బాబా నెల్లూరు కేంద్రం అధ్యక్షులు శ్రీ నంబూరు నమశివయ్య, శ్రీ ఆర్. సింహాచలం కార్యక్రమం పర్యవేక్షించారు.

### ఆర్యవైశ్య సంఘం ఖర్చులేని సంతాపం

నెల్లూరు ఆర్యవైశ్య సంక్షేమ మహాసభ సర్వసభ్య సమావేశం 10తేది పురయం కన్యకా పరమేశ్వరి దేవాలయంలో జరిగింది. శ్రీ మాదాల గోపాలయ్య .అధ్యక్షించారు. శ్రీ వివి సుబ్బరాయులు శెట్టి, కె. సుబ్రహ్మణ్యం శెట్టి, ఎస్‌వి రత్నం మాట్లాడారు. మహారాష్ట్ర భూకంప బాధితులకు సానుభూతి వ్యక్తం చేస్తూ ఒక నిముషం మౌనం పాటించారట. అదైతే ఖర్చులేని పనికదా మరి!

### సద్భావనా అవార్డు పొందిన నెల్లూరు బాలిక

నెహ్రూ యువకేంద్రం జిల్లా స్థాయిలో ఇటీవల స్కూలు పిల్లలకు వ్యాసరచన పోటీలు నిర్వహించి. సద్భావనా అవార్డులు ఇచ్చింది. వివేకానందుని దృష్టిలో భారత దేశము అనే అంశంపై చిన్న తరగతుల పిల్లలకు నిర్వహించిన పోటీలో ఉర్దు భాషా విభాగానికి సంబంధించి ప్రభుత్వ బాలికోన్నత పాఠశాల 7 తరగతి విద్యార్థిని కుమారి తెహరా బేగం అవార్డు సంపాదించింది. గాంధీ జయంతి రోజు కస్తూరిబా కళాక్షేత్రంలో ఆ బాలికకు అవార్డు అందజేశారు.

### సత్యసాయి నాట్యమండలి

శ్రీ సత్యసాయి నాట్యమండలి వార్షికోత్సవం దర్గామిట్ట రాజేశ్వరి దేవాలయంలో జరిగింది. రిటైర్డ్ జిల్లా జడ్జి శ్రీ కెపి నారాయణరావు అధ్యక్షించారు. దేవస్థానం ఛైర్మన్ శ్రీ కెవి రాఘవరెడ్డి, ఎపిటిఎఫ్ అధ్యక్షుడు శ్రీగాలయ్య, డివిఎస్ నాట్యమండలి కార్యదర్శి శ్రీ బషీర్ మాట్లాడారు. ప్రఖ్యాత నటుడు శ్రీ టివి రమణరావుకు స్వర్గీయ డివి సుబ్బారావు అవార్డు ఇచ్చి సత్కరించారు. నాట్యమండలి అధ్యక్షుడు శ్రీ లిల్ల వెంకటేశ్వర్లు కార్యక్రమం నిర్వహించారు.

### పేపర్ మర్చంట్స్ మహాజన సభ

రాష్ట్ర పేపర్ మర్చంట్స్ సంఘం మహాజన సభ. 13 వార్షికోత్సవం 3 తేది జీవరప హాలులో జరిగాయి. ఈ సమావేశం నెల్లూరులో జరగడం ఇదే ప్రథమమట. రాష్ట్ర మంతటి నుంచి ప్రతినిధులు వచ్చారు. ఏర్పాట్లు ఆడంబరంగా జరిగాయి. భారత పేపర్ మర్చంట్స్ వెల్‌ఫేర్ అసోసియేషన్ అధ్యక్షుడు శ్రీ అన్నామల్లై చెట్టియార్ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. రాష్ట్ర సంఘం నిర్వహణకు ఆయన 10 వేల రూపాయల విరాళం ప్రకటించారు.

సర్కార్ పేపర్ మిల్స్ మేనేజర్ శ్రీ డివిఎస్ మూర్తి, వి.ఆర్. కాలేజి ప్రిన్సిపల్ శ్రీ వి. శ్రీనివాసులు మాట్లాడారు. జిల్లాలో ఏడవ, పదవ తరగతి పరీక్షల్లో ర్యాంకులు పొందిన విద్యార్థినీ, విద్యార్థులను సత్కరించారు. రెడ్‌క్రాస్ సొసైటీ తరపున జపాన్ వెళ్తున్న నెల్లూరు విద్యార్థిని కుమారి సుప్రియను సన్మానించారు. మహారాష్ట్ర భూకంప బాధితులకు సంఘం తరపున 45 వేల రూపాయల విరాళం పంపాలని తీర్మానించడం జరిగింది.

సభా నిర్వహణ భారం - వెంకట్రామ అండ్ కో శ్రీపతి శ్రీనివాస రావు గారిది. పిల్లవాడైనా, అంత పెద్ద సభను చాకచక్యంగా నిర్వహించాడు.

### సారా నిషేధానికి పోలీసు సేవ

జిల్లాలో సారా నిషేధాన్ని ఖచ్చితంగా అమలు జరపడానికి ఎస్.పి. శ్రీ టి. కృష్ణ ప్రసాద్ గట్టి చర్యలే తీసుకుంటున్నారు. ఎక్సైజ్ అధికారులతో నిత్య సంబంధాలు పెట్టుకొని, అక్రమ సారా తయారీ, అమ్మకాల పై ఒక కన్ను వేసి వుండాలని అందరు సబిన్స్ పెక్టర్లనూ ఆదేశం చారాయన. సారా కేంద్రాల పై దాడులు జరపాలనన్న హుకుం జారీ చేశారు. నెల్లూరు పోలీసు ప్రధాన కార్యాలయంలో సారా కేసుల పరిశీలనకు ఒక ప్రత్యేక సెల్ ఏర్పాటు చేశారు.

ఇటు కలెక్టరు, అటు ఎస్‌పి కూడా ఇదే ఉత్సాహంతో పట్టుపట్టి పని చేయిస్తే సారా ఉద్యమం నిజంగానే ఆచరణకు వస్తుంది.

## సినిమా

(7 వపేజి తరువాయి )

గొప్పగా చెప్పుకునే స్వభావం త్యాగరాజన్‌ది. "ఈ పోలీస్ స్టేషన్‌తో పాటు పక్కనే ఒక పోస్టాఫీస్ కూడా ఏర్పాటు చేసి ఉంటే బాగుండేది. మా ప్రశాంత్‌కు ప్రతి రోజూ అసంఖ్యాకంగా ఉత్తరాలు వస్తున్నాయి" అన్నాడాయన గొప్పగా ! గోరంతను కొండంతలుగా చెప్పడంలో కూడా కాస్త విజ్ఞత కనబరచాలి.

### జపాన్‌లో మాస్టర్ తరుణ్

" అసలు సినిమాలలో నటించనని మొండి కేసిన నాచేత 'అంజలి' చిత్రంలో అత్యద్భుతంగా నటింపజేసిన మణిరత్నంగారికి నేను కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఆ చిత్రానికి నేషనల్ అవార్డు వచ్చింది. మనసు-మమతకు స్టేట్ అవార్డు వచ్చింది. జపాన్‌లో చిల్డ్రన్ ఫిలిమ్ సొసైటీ నిర్వహించిన బాలల చిత్రాల పోటీ రహిత విభాగంలో నేను హీరోగా నటించిన 'అభయం' మలయాళ చిత్రం ప్రదర్శింప బడింది. ఈ సందర్భంగా నేను జపాన్‌కు ఆహ్వానింప బడ్డాను. ఈ ప్రయాణం మూలంగా నా అభిమాన నటుడు జాకీచాన్‌ను కలుసుకోగలిగాను, " అన్నాడు మాస్టర్ తరుణ్ . ఈ పదేళ్ల వయస్సులోనే ఆ చిరంజీవి ఎన్ని అవార్డులు అందుకున్నాడు!

డబ్బింగ్ చిత్రాల నిర్మాణం, స్టార్ ఫిలిమ్ అకాడమీల నిర్వహణతో పాటు అడపాదడపా చిత్రాలలో నటిస్తున్న చక్రపాణి " మా అబ్బాయితో పాటు నేను, రోజారమణి, మా అమ్మాయి అమూల్య కూడా జపాన్ వెళ్లాం. ఒక జపనీస్ చిత్ర నిర్మాణ సంస్థతో సంయుక్తంగా నేనో బాలల చిత్రాన్ని నిర్మించడానికి నిశ్చయం జరిగింది. వివరాలు తర్వాత చెప్తాను. " అన్నారు.

1966లో " భక్తప్రహ్లాద" చిత్రంలో ప్రధాన పాత్రతో చిత్రరంగంలో ప్రవేశించిన రోజారమణి దాదాపు 200 చిత్రాలలో నటించింది. 1981 లో చక్రపాణిని వివాహమాడాక 1985లో 'నిర్దోషి' చిత్రంలో సుహాసినికి కంఠదానం చేయడంతో డబ్బింగ్ ఆర్టిస్ట్‌గా చాలా బిజీ అయిపోయింది. చాలా మంది ఇతర భాషల తారలకు తమె కంఠమే ఊపిరి పోస్తోంది. " అన్ని విషయాలలోనూ జపనీయులు మనకన్నా ఎంతో ముందున్నారు. అక్కడ మేం బస చేసిన 'పొలారియా హోటల్' లో అత్యాధునిక సదుపాయాలు గల గదులు, షాపింగ్ కాంప్లెక్స్ , థియేటర్లతో అదే ఒక చిన్న నగరంలా వుంది. చలన చిత్రాలు నిర్మించడంలో జపాన్ వారి ప్రతిభ గురించి అందరికీ తెలుసు. మొత్తం మీద మా జపాన్ యాత్ర ఒక మధురానుభూతి" అంది రోజారమణి.

## జో పాపా లాలీ !

- జయంపుకృష్ణ

అమ్మ ఒడిలో వెచ్చగ ఒదిగి
పాలను తాగుతూ పడుకుంది
కలలను గంటూ ఓ పసిపాప
ఆ కలలలోనె నిదరోయింది

అమ్మ ఎద మీద ఆడాలని
అమ్మ జోకొడుతు పాడాలని
నాన్నతో కలిసి నడవాలని
కలలు అలలు కలల అలలు

ఫెళఫెళమంటూ పెంకులు చిమ్ముతు
ధరిత్రి నిలువున పగిలింది
కొంపలు కూలి, కప్పులు కూలి
సజీవ సమాధి చేసింది

ఉలికి పాటుతో ఆ పసిపాప
కనులు తెరిచి అటు చూసింది
అమ్మానాన్నా గుండెలు పగిలి
అంతట రక్తం చిమ్మింది

తియ్యగ వుండే తలి చనుబాలు
ఉప్పగ నిప్పుగ మారాయి
తెల్లని చల్లని ఆ పాలన్నీ
ఎర్రగ జీరలు కట్టాయి

అర్థం కాని ఆ పసిపాప
అరణ్య రోదన చేసింది
దిగులు దిగులుగా చుట్టూ చూసి
దిక్కులదిరేలా ఏడ్చింది

వినేవాళ్లక్కడెవరూ లేరు
కనేవాళ్లు మరి అసలే లేరు
అల్లరి ముద్దుగ పెరిగిన పాప
శిథిల నిలయంలో ఓ చిరు మొలక

మహారాష్ట్ర భూకంపం - 11 గంటల తరువాత శిథిలాల లోంచి- తల్లి ఒడిలో బతికి బయట పడిన ఆ పసిపాప కోసం- అశువులు కోల్పోయిన ఎందరో ఆత్మశాంతి కోసం - రచయిత

జమీన్‌రైతు
సంవత్సర చందా రు 100/-
6 నె లలకు- రు.50/-

## వై.ఎస్.ఆర్.

(1వ పేజీ తరు వ

రాజశేఖర రెడ్డి ఒక్కరే. ముఠా నాయకుడిగా, రక్తసిక్త చరిత్ర కల్గిన కుటుంబ సభ్యుడుగా వుండి కూడా, ప్రజలలో అభిమానం, ఫాలోయింగ్ పొంద గల్గడం అభినందనీయం; ఆశ్చర్యకరం. కాని, ఏమి లాభం? రాజశేఖర రెడ్డిలోని సులక్షణా లన్నింటినీ ఆయనకున్న ఆవేశం అనే ఒకే ఒక దుర్లక్షణం గ్రహణం పట్టిస్తున్నది. వ్యక్తిగతంగా అత్యంత ఉద్రేక పరుడు. కడప జిల్లా రాజకీయాలలో ఆ ఉద్రేకం ఒక భాగం కదా రాష్ట్ర రాజకీయంలోనూ అదే తీరున ఆవేశ పూరితంగా ప్రవర్తించడం, తొందరపడి నిర్ణయాలు చేసి ఆ తర్వాత నాలుక్క రుచు కోవడం అలవాటై పోయింది. అందువల్లే ఆయన తనకు తెలియకుండానే తాను ప్రతి నాయకుడిగా మారి పోతుంటారు; ఖల్ నాయక్ వేషంలోనే రాణిస్తుంటారు; కథానాయకుడిగా వ్యవహరించడం చేత కావడం లేదు. ఎన్టీఆర్ పై ఏడేళ్ల పాటు సమరం చేయడంలో ఈ వైఖరి వంట బట్టింది. ఆయన్ను నాయకత్వ స్థాయికి పెంచిందీ ఆ ఏడేళ్ల పోరాటమే. కానీ చావుకు, పెళ్లికి ఒకే మంత్రం పఠిస్తే కుదురు తుందా? ఎన్టీఆర్‌తో పోరాటంలో పలువురు యువ కాంగ్రెస్ నాయకులు ఆయన్ను అభిమానించడం ప్రారంభించారు. క్రమక్రమంగా వారు భింద్రన్ వాలే టైగర్ ఫోర్స్ వంటి హార్డ్ కోర్ కాంగ్రెస్ మిలిటెంట్లుగా తయారైనారు. ఆ సైన్యం చెన్నారెడ్డి, జనార్దన రెడ్డిల పై సమరానికి కూడా బాగా ఉపకరించింది.

విజయభాస్కర రెడ్డితో కొద్ది కాలం సఖ్యంగానే మెలిగారు వీరు. కాని తమ స్వభావం మారదు కదా? జనార్ధన రెడ్డి, చెన్నారెడ్డిల వలె సంబంధాలు త్రెంచేసు కోకుండా విజయ భాస్కర రెడ్డి వైఎస్‌తో కలిసి పోవడానికే ప్రయత్నించడంతో ఏడాది కాలం పేచీలు పెరగలేదు. మొన్నటి మంత్రి వర్గ విస్తరణలో వైఎస్ హార్డ్ కోర్ మిలిటెంట్లు నలుగురికి మంత్రిత్వాలూ ఇచ్చారు. దానితో సంతృప్తి పడి సర్దుక పోవలసింది. కానీ రాజశేఖర రెడ్డి ఎందు వల్లనో గిల్లి కజ్జానికే సుముఖత చూపారు, సద్భావనా యాత్రలు తలపెట్టారు.

అనంతపూర్ రాజకీయాలలో ఆ జిల్లా మంత్రి శ్రీ జె.సి. దివాకర రెడ్డి జోరు తగ్గించడానికి, రాయలసీమలో తాను తిరుగులేని నాయకుడని నిరూపించు కోవడానికి వైఎస్ కనిపెట్టిన పాశుపతాస్త్రం ఈ సద్భావనా యాత్ర. అనుకోకుండా ఆ సభకు జనం విరగ బడ్డారు. ఆ జిల్లా ఎమ్మెల్యేలు ఐదుగురు వెంట నిలబడ్డారు. అంత జనాన్ని చూసేసరికి రాజశేఖర రెడ్డిలో పూనకం వచ్చింది. దివాకర రెడ్డితో మొదలు పెట్టి చెన్నా, జనార్దన రెడ్డి లిద్దరినీ చరిత్ర హీనులని తిట్టి, విజయ భాస్కర రెడ్డిని సైతం వదలకుండా దులిపి పారేశారు. అదే స్పీడులో ప్రక్కరోజు పత్రికల వారిని పిల్చి ప్రధానిని కూడా వ్యాఖ్యానించారు. అనంతపూర్ తరహాలో ప్రతి జిల్లాలో సద్భావనా యాత్రలు నిర్వహిస్తానని ప్రకటించారు. ఈ ఆవేశంలో తానొక కాంగ్రెస్ పార్టీ ఎమ్మెల్యేనని, రాష్ట్రంలో వున్నది తన పార్టీ ప్రభుత్వమని మర్చి పోయినట్లున్నారు.

కాంగ్రెస్‌లోని ఇతర వర్గాలలో, ఢిల్లీ వరకున్న, నాయకులలో ఈ ధోరణి కలవరం కల్గించింది. వైఎస్ దూకుడుకు బ్రేకు వేయకుంటే ప్రమాదమని అందరూ ఏకాభిప్రాయానికి వచ్చారు. వైఎస్ అనుయా యుల్లోనూ అసంతృప్తి కల్గింది. ఎప్పుడూ ఎవరో ఒకర్ని తిడుతూ, ఎవరితో ఒకరితో యుద్ధం చేస్తూ వుంటే తమను ప్రజలు ఛీత్కరిస్తారన్నది అనుయాయుల భయం. కోట్ల అనుచరులూ, వైఎస్ పై క్రమశిక్షణా చర్య తీసుకోవాలని బహిరంగంగానే పిలుపు నిచ్చారు.

ఈ దశలో ఏమి జరిగిందో ఏమో, ఢిల్లీ నుంచి ఏ మొట్టికాయలు పడ్డాయో ఏమో తెలియదు కాని వైఎస్ వున్నట్లుండి మారి పోయాడు. ఆ మార్పు కూడా తలక్రిందుల వంటిది.

అనంతపూర్ నుంచి తిరిగి రాగానే కోట్ల కుడి చెయ్యి అనదగిన రెవిన్యూ మంత్రి శ్రీ రామిరెడ్డి వైఎస్‌ను కలిసి కడసారి రాయబారం నడిపారు. నోరు అదుపు చేసుకో కుంటే కోట్లలో కూడా ఓర్పు నశిస్తున్నదని, తర్వాత విచారించి లాభం లేదని హెచ్చరించారు. ఈలోగా వైఎస్‌కు ఢిల్లీ నుంచి ఘాటైన టెలిఫోన్ సంశం వచ్చింది. హస్తినాపురి వర్తమానం కూడా - ఇదే చివరి ఛాన్స్ అన్నది! దానితో వైఎస్ దూకుడు తగ్గింది. పైగా హైదరాబాదు ప్రెస్‌ను పిల్చి, కోట్లను పొగిడాడు. కరెంట్ కరువు వంటి క్లిష్ట సమస్యలను ఆయన చాకచక్యంగా పరిష్కరించ గల్గాడని కితాబు ఇచ్చాడు. చెన్నారెడ్డి, జనార్ధన రెడ్డిలు రాయలసీమకు ఏమీ చేయలేదు కాబట్టి, రాయలసీమ చరిత్రలో వారి పేర్లు వుండవు కాబట్టి, చరిత్ర హీనులన్నానే తప్ప వారు కూడా రాష్ట్రానికి సేవ చేసిన వారేనని సంజాయిషీ ఇచ్చుకున్నాడు. ప్రధాని పివిపై తాను చేసినట్లు పత్రికలలో వచ్చిన వ్యాఖ్యలు సరికావని, ప్రధాని పివి ఒక్కడే పార్టీకి దిక్కని సరిదిద్దుకున్నాడు.

తాత్కాలికం గానైనా తమ నాయకుడు ముఖ్యమంత్రితో సర్దుక పోవడం వైఎస్ అనుచర మంత్రులకు ఊపిరి పీల్చుకునే వసతి కల్పించింది. వారి గుండెలు ధిటవు పడ్డాయి. లేకుంటే అసలే ముక్కోపి అయిన ముఖ్యమంత్రి తమ నెక్కడ ఇంటికి పంపుతారో నన్న భీతి వుండింది వారిలో! జనార్దన రెడ్డి, చెన్నారెడ్డి లిద్దరికి వైఎస్ దాసోహం సహజంగా సంతోషం కల్గించే పరిణామమే.

ఈ గుణపాఠమైనా రాజశేఖర రెడ్డిలో సంయమనం కల్గిస్తుందో లేక మళ్లీ పురుగు దొలిస్తే మామూలై పోతాతో వేచి చూడాలి!

## పేడతట్ట

(1వ పేజీ తరువ )

ధాటికి తట్టుకోలేక "నేనుగా పత్రిక వాళ్లను పిలిచి మాట్లాడటం లేదు. వాళ్లే వచ్చి గిల్లుతుంటే నా అభిప్రాయాలు చెబుతున్నా" నని సమాధాన పరిచారట. సమావేశం తర్వాత జరిగిన పత్రికా విలేఖరుల సమావేశంలో పిసిసి అధ్యక్షుడి విమర్శలు ప్రస్తావనకు రాగా 'ముఖ్యమంత్రి కల్పించుకొని' మీరే (విలేఖరులు) నంటకదయ్యా ఆయన చేత నా మీద విమర్శ చేయిస్తున్నది. పాపం తులసి అమాయకుడు". అంటూ పక్కనే వున్న తులసీదాస్‌ను కౌగిలించుకున్నారు. ఈ సన్నివేశం తర్వాత తులసీదాస్ గారి వైఖరిలో బోలెడంత మార్పు కన్పిస్తోంది. కోట్లవారి ఏడాదిపాలనపై తులసీ దాస్ ప్రశంసల వర్షం కురిపించారు. దీనితో తులసి అంటే కోట్లవారు కూడా మెతక వైఖరి అవలంబిస్తున్నారట. వచ్చే ఏడాది మార్చి వరకు తులసీదాస్ పిసిసి పీఠానికి గడువుంది. ఈలోగానే తులసీదాస్‌ను మార్చాలని కోట్లవారు విఫల యత్నంచేశారు. ఇప్పుడెలాగూ తులసి దారిలోకి వచ్చారు కాబట్టి వచ్చే మార్చివరకు పిసిసి అధ్యక్ష పదవికి ఢోకా వుండదని భావించవచ్చు.

### వై.ఎస్.తో కోట్ల'దోస్తీ'

రాష్ట్రప్రభుత్వం పని తీరుపైన, తనపైన విమర్శలు గుప్పిస్తున్నప్పటికీ డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డితో స్నేహంగానే మెలగాలని ముఖ్యమంత్రి నిర్ణయించుకున్నట్లుంది. ఆ మధ్య వై.ఎస్. చేసిన విమర్శలకు ముఖ్యమంత్రి వర్గీయులు తీవ్రంగా స్పందించి ఎదురు దాడికి సిద్ధమయ్యారు. అయితే ముఖ్యమంత్రి వారిని వారించారు. 'ప్రస్తుత పరిస్థితుల్లో వై.ఎస్.తో తగాదా పెట్టుకోవడం మంచిది కాదు. కొంతకాలం ఆగండి' అంటూ ముఖ్యమంత్రి బుజ్జగించారట. కానీ ముఖ్యమంత్రి మనస్సు తెలిసి రాజ్యసభ సభ్యుడు గంగుల ప్రతాప్ రెడ్డి ఢిల్లీలో విలేఖరుల సమావేశం పెట్టి వై.ఎస్.పై రెచ్చిపోయాడు. అయితే ఆ తర్వాత కోట్లవారి రాజీ సందేశం తెలుసుకున్నాక 'సర్దుకున్నాడు'. వై.ఎస్. వర్గీయులు కూడా ప్రతాప్ రెడ్డి విమర్శల్ని పట్టించుకోకుండా ఆ విషయానికి అంతటితో తెర దించారు. వై.ఎస్.తో ఇటీవల మంచి స్నేహం పెంచుకున్న అనంతపూర్ జిల్లా ఎమ్మెల్యే రవీంద్రరెడ్డి మాత్రం స్పందిస్తూ "వై.ఎస్.ను పార్టీనుంచి సస్పెండ్ చేస్తే రాష్ట్రంలో 'మూడోశక్తి' ఆవిర్భావం తథ్యమని హెచ్చరించాడు. రవీంద్రరెడ్డికి వై.ఎస్. మీద ప్రేమ కంటే తన జిల్లా మంత్రి జెసి దివాకరరెడ్డి పై వున్న ద్వేషమే ఈ హెచ్చరికకు కారణమట.

ఇలా వుండగా నిన్నటిదాకా అనంతపూర్ జిల్లాలో తిరుగులేని నాయకుడిగా చెలామణి అయిన దివాకర్ రెడ్డికి వ్యతిరేకంగా ఇప్పుడు నలుగురైదుగురు ఎమ్మెల్యేల్లు తయారయ్యారు. దీని వెనుక వై.ఎస్. హస్తం వుందన్న సంగతి బహిరంగ రహస్యమే.

### పోటీ ' సద్భావన' సదస్సులు

రాష్ట్రం కాంగ్రెస్ ఇప్పుడు పోటీ సదస్సుల జోరుతో కుతకుతలాడుతోంది. ఇటీవలనే వై.ఎస్. రాజశేఖరరెడ్డి 'సద్భావన' పేరుతో తన ప్రత్యర్థి దివాకర్ రెడ్డి సొంత జిల్లా అనంతపూర్‌లో సదస్సు పెట్టి బెంబేలెత్తించేశారు. ఆ సదస్సు విజయవంతం కావడంతో ఇప్పుడు రాష్ట్ర వ్యాప్తంగా సద్భావన సదస్సులకు నడుం కట్టారు. పనిలోపనిగా నెల్లూరు, కర్నూలు జిల్లాల్లో కూడా పెద్ద ఎత్తున సదస్సులు నిర్వహించి తన ప్రత్యర్థులైన ఎన్. జనార్ధనరెడ్డి, కోట్ల విజయభాస్కరరెడ్డికి కూడా తన 'చేవ' చూపించాలనుకుంటున్నాడట. వై.ఎస్. సద్భావన సదస్సుకు పోటీగా ఆయన జిల్లా కడపలో మరో సద్భావన సదస్సుకు రవాణా మంత్రి డాక్టర్ ఎమ్.వి మైసూరారెడ్డి రంగం సిద్ధం చేస్తున్నాడు. ఇలా వుండగా ఖమ్మంలో జలగం వెంగళరావుకు వ్యతిరేకంగా కోట్ల వర్గం ఏర్పాటు చేసిన సమావేశానికి పోటీగా 'జలగం వర్గం కూడా మరో సమావేశం ఏర్పాటు చేసి ఎదురు దాడికి దిగింది. దీంతో ఖమ్మం జిల్లా కాంగ్రెస్‌లో ఇప్పుడు 'రణరంగ' వాతావరణం నెలకొని వుంది.

## పెండేకంటి

(1వ పేజీ తరువ )

రాష్ట్ర రాజకీయాలలో వృద్ధికి వచ్చిన అతికొద్ది మంది వైశ్యులలో శ్రీ వెంకట సుబ్బయ్య ప్రధములు. కత్తులు, కటార్లు నూరుకొనే హింసాత్మక కర్నూలు రాజకీయాలలో సాధు స్వభావి అయిన పెండేకంటి అన్నేళ్లుగా నాయకుడుగా చలామణి కావడంలోనే ఆయన చాతుర్యం, ప్రతిభ వ్యక్తమౌతాయి.

వెంకటసుబ్బయ్యగారు 1957 నుంచి 80 వరకు నిరాటంకంగా పార్లమెంట్‌కు గెలుపొందారు. 80 నుంచి 84 వరకు కేంద్ర మంత్రిగా వ్యవహరించారు. మహారాష్ట్ర,బీహార్ రాష్ట్ర గవర్నర్‌గా రాణించారు. స్వాతంత్ర్య సమరంలో చురుకుగా పాల్గొన్న దేశభక్తుడాయన. బనగానపల్లి జమీందారు వద్ద ఉద్యోగిగా చేరి, ఆ నవాబు పాలనకు వ్యతిరేకంగానే ఉద్యమం నడిపి, ఆ సంస్థానం భారత యూనియన్‌లో విలీనమయ్యేట్లు చేశాడు.

వెంకటసుబ్బయ్య గారు 'జమీన్‌రైతు' అభిమాని. జమీందారీ వ్యతిరేక ఉద్యమం సమయం నుంచి ఆయనకు మా పత్రికతో సంబంధం వుంది. అప్పటి పత్రికలోని పద్యాలు, గేయాలు తరచు జ్ఞాపకం చేసుకొనేవారు. జమీన్‌రైతు జనకుడు స్వర్గీయ రామానాయుడుగారి జయంతి సభలో ఒకసారి పాల్గొన్నారు. ఆయనకు మా శ్రద్ధాంజలి.

## శ్రద్ధాంజలి



జననం: 1892 మరణం: 1984

ప్రముఖ ఖద్దరు దారి, అందిరచేత మంచి అనిపించుకొన్న నిష్కపటి నిర్మొగమాటి, దామెగుంట సర్పంచ్‌గా, గ్రామ మునసబుగా, ఎం.పి.సి.ఎస్. ప్రెసిడెంటుగా ప్రజలకు ఎనలేని సేవ చేసిన మూర్తి

**దాసు అయ్యన్న శెట్టి గారు**

స్వర్గస్థులై 17.10.1993 తేదికి తొమ్మిది సంవత్సరాలు నిండినవి. వారి తొమ్మిదవ వర్ధంతి సందర్భంలో మా శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

**దాసు సుబ్బరామయ్య - కుమారుడు**

దాసు సరోజనమ్మ - కోడలు

ఇండ్ల వనమ్మ - కుమార్తె

ఇండ్ల వెంకయ్య - అల్లుడు

**మరియు మనుమలు, మనమరాండ్రు**

లేబర్ ఆఫీసర్ గారు ఒక్కసారి కూడా మా గోడు ఆలకించలేదు.

బిల్లుల్లో మాకు నెలకు రూ.1075 లు ఇస్తున్నట్లు వ్రాస్తారు. కనీసవేతన నియమం పాటిస్తున్నట్లు అధికార్లను నమ్మిస్తారు. నెల అంతా గొడ్డు చాకిరీ చేయించుకొని మా చేతిలో 500 లేదా 600 పెడతారు. అదేమని అడిగితే ఉద్యోగం ఊడిపోతుంది. మాకు ఉద్యోగ భద్రత లేదు. యజమాని దయతలచి నంత సేపే భుక్తి; తర్వాత ఇంటికి పోవాలి! పొద్దున 10 గంటలకు వస్తే రాత్రి పదింటి వరకు క్షణం విడుదల వుండదు. నిలబడే పని చేయాలి. ఊపిరి పీల్చుకునే వ్యవధి వుండదు. వెట్టి చాకిరి కంటే హీనం. ఏ కూలి పనికి పోయినా ఇంతకంటే ఎక్కువే గిట్టుబాటౌతుంది. బేల్దారిగా తాపీ పట్టుకుంటే రోజుకు రూ.50లు గిడుతున్నది. కానీ అధిక భాగం గుమాస్తాలు డిగ్రీ హోల్డర్లు. కూలి పనికి పోవడానికి నామోషీగా భావించి ఈ గాడిద చాకిరీ చేస్తున్నాము.

లేబర్ ఆఫీసర్ గారికి మా దీనస్థితి కన్పడ దెందువల్ల? మందులంగళ్ళలో గుమాస్తాలకు ఎంత జీతం ఇస్తున్నారు, ఎన్ని గంటల పని చేయించు కుంటున్నారు అని అడగ రెందువల్ల? ఆయన పై అధికారి ఎవరైనా మా గోడు విన్పించు కోకూడదా? మాకు న్యాయం చేయకూడదా? -బాధిత గుమాస్తాలు.

## పెద్ద గ్రామమంతలేదు- కార్పోరేషన్ ఫీజా?

(3 పేజీ తరువాయి)

నెల్లూరు టౌన్ జనాభా పెరిగిపోయింది కాబట్టి, కార్పోరేషన్గా జమకట్టి, ఇప్పటి అబ్కారీ సంవత్సరం నుంచే హైదరాబాదు సిటీలో వసూలు చేసే రేటున బ్రాందీ షాపుల లైసెన్సు ఫీజు దండాలని ఎక్సైజ్ సూపరింటెండెంట్ గారు నిర్ణయించినట్లు వార్తలు వస్తున్నాయి. ఇది అన్యాయం. నెల్లూరు పేరుకే టౌన్ కాని, పెద్ద గ్రామానికున్న సౌకర్యాలు కూడా లేవు. జన సంఖ్య పెరిగినా, సిటీ కల్చర్ రాలేదు. అసలే రోజుకొక రాజకీయ పార్టీ చేసే బంద్లతో మా వ్యాపారాలు దెబ్బతిని పోతున్నాయి. ఇంకొక ప్రక్క మద్యపాన నిషేధ ఉద్యమం ఊపందుకొని ఎన్ని రోజులు వ్యాపారం నడుస్తుందో, ఏ రోజు మూత పడుతుందో అర్థం కాక జుట్టు పీక్కుంటున్నాము. లక్షల పెట్టుబడితో అంగళ్లు తెరిచి, అవి మధ్యలో మూత పడితే దివాలా తీయడం ఖాయం. ఈ పరిస్థితులలో మూలిగే నక్కపైన తాటికాయ పడి లైసెన్సు ఫీజులను సిటీలతో సమానంగా పెంచితే మేమంతా కంకరగిరి మాన్యాలు పట్టి పోవలసిందే! అయ్యా సూపరింటెండెంట్ దొరవారూ ప్రభుత్వానికి ఆదాయం పెంచి చూపి మెహర్బానీ పొందవచ్చునే ఆశతో మా కడుపులు కొట్టబాకండి! మేము చల్లగా వుంటేనే కదా - మీ శాల మామూళ్ళు మీకు ముట్టి మీ ఇళ్లు బంగారంతో నిండేది!

-ఒక యజమాని!

## గూండాలు ప్రజా నాయకులైతే!

గూండాలు, రౌడీలు ప్రజానాయకులైతే హత్యలు, దొమ్మీలు, బాంబు పేలుళ్లు నిత్య కృత్యాలవు తాయని గత వారం మీ పత్రికలో శివారెడ్డి పై వ్రాసిన వ్యాసం చదివితే అవగతమైంది. ఇటువంటి భయోత్పాతాన్ని సృష్టించి వీరు నాయకులుగా మన గుర్తింపు పొందుతున్నారు తప్ప. ప్రజాభిమానంతో కానే కాదని నాకు తోస్తుంది. మరి కరవు రాజకీయాలు భ్రష్టు పట్టిపోయి వున్నాయి. వాటిని సంస్కరించే వారెవరైనా ఇక్కడ వున్నారా!

నెల్లూరు -గునుపాటి వేణుగోపాల్

## రియల్హీరో భజన

(1 వపేజీ తరువాయి)

వివరిస్తూ వ్యాసాల్ని రాయించి మరీ పత్రికల్లో ప్రచురింప జేశారు. 'వ్యాసాలు ప్రచురించిన వారికే ప్రకటనలు' ఇస్తాం అని సమాచార శాఖ షరతు పెట్టడంతో పాపం పత్రికలకు ఏడాదిపాలన 'బాకా' ఊదక తప్పిందికాదు.



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,